# జీవన్ మరియు హనూ చెబుతున్నారు

# భావవ్యక్తతని గూర్చి

1983 అన్ని దేశాల్లో ప్రపంచ భావవ్యక్తత సంవత్సరంగా జరుపుతున్నారు. అయితే భావవ్యక్తత అంటే అసలు ఏమిటి?

ఒక వ్యక్తి మరొక వ్యక్తితో సంబంధాన్ని నెలకొల్పడం కోసం, ఒకరకంగా సమాచారాన్ని అందించడం. మీరు జీవన్ మరియు హనూ మీకు భావాన్ని వ్యక్తం చేయడం అన్నది చదువుతున్నప్పుడు, అంటే యిప్పుడు జరుగుతున్నది అదే.

ఏదో రకంగా ఎంత కృతకంగానైనా సరే సమాచారం అందించకపోతే జీవితం అసంభవం అవుతుంది.





సూక్ష్మజీవులనుండి, అన్నిరకాల మొక్కలు, జంతువుల ద్వారా, దాన్నుండి అత్యంత ప్రగతి సాధించిన మానవుడి దాకా... ప్రతి జీవీ భావవ్యక్తం చేస్తుంది. శబ్దాలతో, సంజ్ఞలతో, కదలికలతో, వాసనలతో, స్పర్శతో రంగులతో ... విద్యుత్తు ప్రవాహంతో కూడా.

నిజానికి ఒక ఎదిగిన జంతువు తన భావాన్ని 15 నుంచి 35 వేర్వేరు రకాలుగా వ్యక్తంచేస్తుంది.

మధ్య అమెరికా దేశపు అరిచే(హౌలింగ్) కోతి నిర్దిష్టమైన తొమ్మిది రకాల అరుపుల్లో తన భావాన్ని వ్యక్తపరుస్తుంది. తన గుంపుపైన దాడి జరగబోతుంటే ఒకరకమైన అరుపు. మరొకరకమైన అరుపుతో 'ఇక్కడ మేతవుంది.' అనే సూచన, దానికి మరొక మగ కోతి ఒప్పుకోకపోతే, అలజడితో బాటు వివాదం ఆరంభం అవుతుంది.

గుడ్లగూబలు వాటి ముక్కుల్ని రాయడం ద్వారా, రెక్కల్ని కొట్టుకోవడం ద్వారా, "పాడడం" ద్వారా కూడా సంజ్ఞల్ని చేస్తాయి. అరుపులు, కెక్కిరింతలు, ఈలలు, కిచకిచలు యివన్నీ గుడ్లగూబ పాటలు. ప్రమాదంలో చిక్కుకున్న గుడ్లగూబ,(బర్రోయింగ్) బుర్రదకట్ల పాములాగ బుసకొడుతుంది. అందంగా ముందుకు వంగడం, నాట్యం చేయడం, ఎగరడం యివి అడవిలోని గుడ్లగూబ(వుడ్ అవుల్) సరస సల్లాపాలు. ఈకలు టపటప కొట్టడం, రెక్కల్ని సగం పరచడం, శరీరాన్ని బాగా ఊపడం, ముక్కుల్ని రాయడం అన్నవి గుడ్లగూబ ఆత్మరక్షణకి చర్యలు. మరి ఎవరు గాబరాపడరని?

తేనెటీగ తన నాట్యం ద్వారా తను కొత్తగా కనుక్కున్న మేతనుగూర్చి వ్యక్తపరుస్తుంది. చాలాసేపు మత్తుగా నాట్యం చేసిందంటే యిక మరి దావలసినంత మంచి మేత దొరుకుతుందన్న మాట. తోకతిప్పుతూ గుండ్రంగా నాట్యం చేస్తే మేత దగ్గరలో వుందని అర్థం. 100 మీటర్ల దూరంలో మేత వుందంటే. 10 (సైకిల్స్) అంటే 10 000 మీటర్లకి 1 సైకిల్ చొప్పున. మరి మేత దొరికే చోటు సూర్యుడి దిశలో వుంటే తోకను పైకి ఎత్తి ఆ వైపుగా నాట్యం చేస్తుంది. తేనెపట్టు పెట్టే వైపుకి గల కోణంలో తను తిప్పే శరీరాన్ని బట్టి ఎగరవలసిన కోణం సూచిస్తుంది తేనెటీగ మేతని గూర్చి కనుక్కునే యితర తేనెటీగలు కూడా. కొత్త తేనెపట్టు పెట్టే చోటును గూర్చి చాపోటంగా చెప్పదలుచుకున్నప్పుడు యీ నాట్యాన్ని చేస్తాయి.





జంతువులూ, పక్షులూ మాట్లాడలేక పోవచ్చు. కాని అవి బోలెడంత చెబుతాయి!

**జీవితభీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోవడానికి అతి భద్రమైన మార్గం**





**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

1983 WORLD COMMUNICATIONS YEAR

daCunha/LIC/137/83 TL

**Results of Chandamama—Camlin Colouring Contest No. 30 (Telugu)**

*1st Prize:* Kranti Venkateshwarla, Bombay-400 022. *2nd Prize:* K. Sreedevi, Hyderabad-16. M. Karuna Kar, H No. 1-77. P. N. G. Suresh Kumar, Rayagada. *3rd Prize:* S. Sujatha, Hyderabad-500 020. K. Radhamani, Kalpakkam. Thakur Vijay Singh, Cuddapah-516 001. P. Murali Nath, Hyderabad. Kumari P. Rama Deli, Hyderabad. Kumbha Nageswar Rao, Chirala. Ravi R. Erabathini, Bhiwandi. K. Kameswara Rao, Berhampur. V. V. S. R. Raja Shekar. Vishakapatnam-4. S. Geetalakshmi, Hyderabad.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [''మృత్యుగండం''] కు ఆధారం జొన్నలగడ్డ రామలక్ష్మి రచన.

లోకంలో అన్నిటినీ త్యజించిన సాధుసన్యాసులు కూడా, ఒక్కొక్కసారి తమ అవసరాలకు గృహస్థుల మీద ఆధారపడక తప్పదు. అందువల్ల, ప్రజల బాగోగులను సూక్ష్మంగా అర్థం చేసుకోవలసిన బాధ్యత వాళ్ళకున్నది. ఇది, ''సాధువర్తన'' అన్న కథలో చక్కగా వివరించబడింది.

## అమరవాణి

చలత్కాష్ఠో జ్వల త్యగ్నిః, క్రుద్ధః సర్పో విజృంభతే,
క్షోభాదేవ మనుష్యస్య, శక్తేః ప్రాయో విజృంభణమ్.

[కాలుతున్న కట్టెలను కదిపినప్పుడే అగ్ని జ్వలిస్తుంది; కోపం కలిగినప్పుడే పాము బుసకొడుతుంది; కష్టాలు పైబడినప్పుడే మనిషి శక్తిసామర్థ్యాలు వెల్లడవుతవి.]

---

సంపుటి 73 అగస్టు '83 సంచిక 2

విడి ప్రతి: 2-00 : : సంవత్సర చందా: 24-00



## చందమామ కబుర్లు



### ఆంగ్లం నేర్చిన జలచరం

ఇంగ్లండులోని బోస్టన్ నగర జలచర ప్రదర్శనశాలలో వుండే 'సీల్' అనే నీటి జంతువు ఇటీవల మూడు ఇంగ్లీషు మాటలు నేర్చింది. పదేళ్ళు నిండిన ఈ సీల్ అక్కడికి వచ్చిన వారిని "హల్లో ... ఇలా రండి" "ఎలా వున్నారు?" అని పలకరిస్తుంది. 'మరీ అలిసి పోయినట్లయితే "వెళ్ళిపొండి, ఇక్కణ్ణుంచి" అని విసుక్కుంటుంది. అక్కడికి వచ్చేవాళ్ళ నుంచే సీల్ ఈ మాటలు నేర్చినట్లు అధికారులు భావిస్తున్నారు.

### హంతకులను పట్టిన కోతి

చైనాలోని యూనాన్ అనే పట్టణం బజారులో ఒక కోతి నానా తంటాలు పడి అక్కడ వున్న ప్రజలను తన వెంట రమ్మని సైగ చేయసాగింది. దాని సైగలు గ్రహించిన ఒక గుంపు దాని వెంట నడువగా అది వాళ్ళను నిర్జన ప్రదేశానికి తీసుకు పోయింది. అక్కడ ఒక మనిషి హత్య చేయబడి వున్నాడు. అంతేకాదు, ఆ కోతి వెంటనే జన మధ్యంలో వున్న ఇద్దరిని పట్టుకుంది. ఆ తరవాత జరిగిన పోలీసు విచారణలో ఆ ఇద్దరే చచ్చిపడి వున్న వాణ్ణి హత్య చేసినట్టూ, ఆ కోతి చనిపోయిన వ్యక్తి పెంపుడు జంతువు అనీ తెలియవచ్చింది.



### నక్షత్ర సందేశం?



గత సంవత్సరం జూన్ 22వ తేదీ రాత్రి స్పెయిన్ దేశం లోని లాగ్రోనో అనే ఊళ్ళో జేవియర్ బాస్కే అనే మత విద్యార్థి చదువు కుంటూ వుండగా అతని గదిలో వృత్తాకారంలో ఒక వెలుగు ప్రవేశించింది. అప్పుడు ఆ గదిలో వున్న రేడియో వింత ధ్వని చేయసాగింది. జేవియర్ బాస్కే ఆ ధ్వనిని రికార్డు చేశాడు. దానిని పరిశీలించిన విల్లీస్మిత్ అనే విజ్ఞాన శాస్త్రవేత్త అది అంతరిక్ష గ్రహాల నుంచి లేదా ఫ్లైయింగ్ సాసర్ నుంచి వచ్చిన శబ్దమో, సందేశమో అయి వుండొచ్చని భావిస్తున్నాడు.

## మీకు తెలుసా?

1. "భవనాల నగరం" అని ప్రసిద్ధి గాంచిన నగరం ఏది?
2. "ఏడుకొండల నగరం" అని ఏ నగరానికి పేరు? దానికా పేరు ఎందుకు వచ్చింది?
3. "స్వర్ణద్వార నగరం" అని పేరొందిన నగరం ఏది?
4. "ముగ్గురు రాజుల నగరం" అని ఏ నగరాన్ని పిలుస్తారు?
5. "సాధువుల నగరం" అని ఏ నగరానికి పేరు? ఎందువల్ల?
6. "వందశిఖరాల నగరం" అని పేరుగాంచిన నగరం ఏది?

(సమాధానాలు 64వ పేజీలో)



# పదిసంవత్సరాలజబ్బు

శృంగవరం గ్రామంలో వున్న ఒకే ఒక దుకాణం, శేషయ్యది. అతడి దుకాణంలో అన్ని సరుకులూ దొరుకుతాయి. ప్రజల అవసరాన్ని గమనించి శేషయ్య సరుకుల్లో బాగా కల్తీచేస్తూంటాడు. ఆ సంగతి తెలిసి కూడా ప్రజలు నోరెత్తకుండా వాటిని కొనుక్కోవలసిందే. కారణం, ఊరికి అదొక్కటే దుకాణం; పైగా శేషయ్యకు కోపం ఎక్కువ.

ఒక రోజున ఆ ఊరుకు ఒక పరదేశీ వచ్చాడు. శేషయ్య దుకాణంలో సరుకులు కల్తీవై వుండడం గమనించి అతను, శేషయ్యను, ''ఈ ఊళ్ళో పరిశుభ్రమైన వెచ్చాలే దొరకవా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే శేషయ్య పట్టరాని కోపంతో పరదేశీని నానామాటలూ అని, ''శుభ్రం గురించి గొప్పగా మాట్లాడుతున్నావు! అసలు నువ్వెలావున్నావో; నీకు తెలుసా? నీ శరీరం,' బట్టలూ మురికి ఓడుతున్నాయి. అసలు నీ చెయ్యితగలడం వల్లనే, నా సరుకులు మురికి అయిపోయాయి. నేను కాబట్టి నిన్ను దయతలచి వదలిపెడుతున్నాను. పక్క గ్రామంలో వున్న మా అల్లుడి దగ్గిర ఇలా మాట్లాడితే, నిన్ను పులుసులోకి ఎముక లేకుండా తన్ని పంపగలడు,'' అన్నాడు.

ఈ మాటలకు పరదేశీకి వచ్చిన కోపం అంతా ఇంతా కాదు. అతను శేషయ్యతో, ''నన్ను గురించి ఇంత దూషణగా మాట్లాడుతున్నావా! నేనీ దేశాన్నేలే విజయభాస్కర మహారాజుగారి మంత్రి రామభూషణుణ్ణనీ, మారువేషంలో ఇలా వచ్చాననీ తెలిస్తే, నీ విలా మాట్లాడగలవా?" అన్నాడు.

ఆ వెంటనే శేషయ్య పెద్దగా కేకపెట్టి ఉన్నచోటనే స్పృహతప్పి పడిపోయాడు.



పరదేశీ అక్కడ నిలబడకుండా తిన్నగా గ్రామాధికారి ఇంటికి వెళ్లి, తానెవరో చెప్పి, "నిన్నీ గ్రామానికి అధికారిగా వుంచిన దెందుకు? గ్రామంలో ఎలాంటి అన్యాయాలూ జరక్కుండా చూస్తావనే గదా. దుకాణందారు శేషయ్య దురాగతాలు నేను కళ్ళారా చూశాను. కల్తీ సరుకులు అమ్ముతున్నందుకు వాడినీ, వాడి నేరాన్ని చూస్తూ వూరుకున్నందుకు నిన్నూ, ఇప్పుడు కఠినంగా శిక్షించ బోతున్నాను," అన్నాడు.

గ్రామాధికారి తొట్రుపడకుండా అంతా విని మంత్రితో, "మహాప్రభూ, కల్తీ సరుకులు అమ్మడం శేషయ్య తప్పుకాదు. అతడు తనకు తానై కల్తీ చేయడం లేదు. తను కొన్న సరుకులనే అందరికీ అమ్ముతున్నాడు. అసలు పంట పండించే రైతులే సరుకులు కల్తీ చేసి అమ్ముతున్నారు. అందువల్లనే, శేషయ్య కల్తీ సరుకులు అమ్ముతున్నా, నేనేం చెయ్యలేదు. కాని అతడు, మహామంత్రులైన మిమ్మల్నే దుర్భాషలాడడం క్షమించరాని నేరం. బహుశా తమరెవరో తెలిసి వుండదు; అది తెలియక చేసిననేరం!" అన్నాడు.

ఆ మాటలతో మంత్రి కొంచెంశాంతించి, "కల్తీ విషయంలో నువ్వు చెప్పింది నిజమే కావచ్చు. కాని, అతడు ప్రజలతో శాంతంగా మాట్లాడడం నేర్చుకోవాలి. నేను మంత్రినని తెలిసినా, తెలియకపోయినా మర్యాదయివ్వాలి," అన్నాడు.

ఈలోగా గ్రామాధికారి కబురు పంపగా శేషయ్య అక్కడికి వచ్చి, మంత్రిని చూస్తూనే ఆయన కాళ్ళమీద పడి, "తమరెవరో ఎరగక తప్పు చేశాను. నా తప్పును మన్నించకండి, నాకు కొరడా దెబ్బలు శిక్షగా విధించండి," అన్నాడు.

శేషయ్య వినయానికి మంత్రి సంతోషించి, "నన్ను తిట్టినందుకు కోపంలేదు, క్షమించాను. కానీ, నీ దుకాణానికి వచ్చే ప్రజలకు నువ్వు మర్యాద నివ్వడంలేదు. ఆ తప్పును మాత్రం నేను క్షమించను





ప్రజలే నిన్ను క్షమించాలి! సాయంత్రం గ్రామప్రజల ఎదుట నిన్ను విచారిస్తాను, ఇక వెళ్ళు." అన్నాడు.

శేషయ్య అక్కడి నుంచి కదిలిపోయి, ఈ గండం నుంచి బయటపడటం ఎలాగా అని తీవ్రంగా ఆలోచించ సాగాడు. గ్రామంలో అతడంటే చాలామందికి మనసులో చెప్పలేనంత కోపంగా వున్నది. మంత్రి వాళ్ళముందు విచారణ జరిపితే, తనకు కఠినశిక్ష తప్పదు!

సాయంత్రంలోగా శేషయ్య ఊరంతా తిరిగి, తనకు వచ్చిన కష్టం అందరికీ చెప్పుకుని, తనను కాపాడవలసిందిగా కోరాడు. అందుకు ప్రతిఫలంగా కొందరికి చిల్లర బాకీలు రద్దు చేశాడు; మరికొందరికి చౌకగా సరుకు లిస్తానన్నాడు.

చాలామంది అతడి మీద జాలి పడి సాయం చేస్తామన్నారు. ఊరంతకూ శేషయ్యదొక్కటే దుకాణం కావడం వల్ల, అతడికేమైనా కఠినమైన శిక్షపడితే, మరొక దుకాణం వాడు వచ్చేవరకూ ఇబ్బంది పడవలసి వస్తుందని కొందరికి భయం కలిగింది.

ఆ సాయంత్రం ప్రజలందరి ముందు శేషయ్య ఇలా అన్నాడు: "నేనెంతో మర్యాదస్థుడిని, శాంతస్వభావుడిని. ఎవరినీ దేనికీ విసుక్కోను. నిన్నటి నుంచీ

నాకు ఆరోగ్యం బాగా లేదు. ఆరో
బావుండనప్పుడే నేను కోపంగా వుం
ఈ విషయం ఊరంతకూ తెలుసు."

అక్కడ చేరిన ప్రజలందరూ శేష
చెప్పింది నిజమన్నారు. దానితో మ
సంతృప్తి పడి ఏదో అనబోతూం
జనం మధ్య నుంచి శేషయ్య పని
పరుగున వచ్చి అతడి కాళ్ళమీద
"దొరా, తమరు రోజూ నన్ను అ
దానికి కానిదానికీ తిడుతూంటే, అది
చెడ్డ స్వభావం అనుకుని పారబ
ఒక్కొక్కసారి కోపం కొద్దీ తమ
బద్దలు కొట్టాలనుకునేవాణ్ణి. మీరు త
నన్ను తిట్టడానికి కారణం, మీ

రోగ్యమని ఇప్పుడే తెలిసింది. నా తప్పులు క్షమించండి," అన్నాడు.

శేషయ్య వాడిని లేవనెత్తి, "తప్పులు ఎవరైనా చేస్తారు, నేను నిన్ను క్షమించాను!" అన్నాడు ఆప్యాయంగా.

పనివాడు ఈసారి మంత్రి కాళ్ళ మీద పడిపోయాడు. మంత్రి వాణ్ణి లేవనెత్తి, "నీ యజమానిని శిక్షించడంలేదని నువ్వు, నా బుర్ర కూడా బద్దలు కొట్టాలనుకున్నావా?" అని అడిగాడు.

పనివాడు బిక్కమొహం పెట్టి, "లేదు దొరా! నా యజమాని ఆరోగ్యం బాగోనప్పుడే కోపంగా వుంటాడని తెలిసిపోయిందిగదా. నేను, వారి దగ్గిర పది సంవత్సరాలుగా పని చేస్తున్నాను. ప్రతి రోజూ ఆయన, నా మీద కోపంతో మండిపడుతూండేవాడు. అంటే, ఆయన పది సంవత్సరాలుగా ఏదో జబ్బుతో బాధపడుతున్నాడన్నమాట! ఏ జబ్బయినా ముదరడం ప్రమాదం. తమరు వెంటనే, నా యజమానికి తగిన వైద్యం చేయించండి," అన్నాడు.

పనివాడు చెప్పిన మాటల ద్వారా మంత్రికి శేషయ్య నిజస్వరూపం తెలిసిపోయింది. ఆయన పనివాడి కేసి చిరునవ్వుతో చూస్తూ, "నీ యజమాని జబ్బుకు వైద్యుడెందుకు, నేనే మందు వేశాను. ఆ మందు పని చేసిందీ, లేనిదీ నీనుంచే తెలుసుకుంటాను," అన్నాడు.

తర్వాత మంత్రి, శేషయ్యా కల్తీ సరుకులు అమ్మరాదనీ, ఒకవేళ తాను కొన్న సరుకుల్లో కల్తీ వుంటే, బాగుచేసి మరీ అమ్మాలనీ గట్టిగా చెప్పాడు. ఇకముందు శేషయ్య ప్రవర్తన ఎలా వుంటుందో తెలుసుకునేందుకు, నెలకొకసారి తన మనుషుల్ని అతడి పనివాడి దగ్గిరకు పంపుతానన్నాడు.

మంత్రి వెళ్ళిపోయాక శేషయ్యలో గొప్ప మార్పు వచ్చింది. తన యజమానిని పది సంవత్సరాల నుంచీ పీడిస్తున్న జబ్బును, మంత్రి ఒక్క రోజులో కుదిర్చాడని శేషయ్య పనివాడు తనకు తెలిసిన అందరికీ, ఆశ్చర్యంగా చెబుతూండేవాడు.








## 4

[పద్మపాదుడు, పింగళుడు భల్లూకపర్వతాలకు బయలుదేరారు. కొంత దూరం ప్రయాణం చేసిన తరవాత, పింగళుడు స్నానం చేసేందుకు, ఒక కొలను దగ్గిరకు వెళ్ళాడు. అక్కడ, బంధింపబడివున్న భల్లూకకేతుడనే వాడు, పింగళుణ్ణి సాయం చేయవలసిందిగా అడిగాడు. పింగళుడు అతణ్ణి సమీపించబోయేంతలో, పద్మపాదుడు కేకవేశాడు. తరవాత—]

పద్మపాదుడి కేక విని, పింగళుడు అదిరి పడి వెనుదిరిగి చూశాడు. అతడి చేతిలోని రాయి జారి కొలనులో పడి పెద్దగా శబ్దమైంది.

''పింగళా! అతడెవరనుకుంటున్నావు?'' అంటూ పద్మపాదుడు కఠినంగా ప్రశ్నించాడు.

పింగళుడు ఒకసారి భల్లూకకేతుడి కేసి చూసి తలవంచుకున్నాడు.

భల్లూకకేతుడు, పద్మపాదుడి కేసి అనుమానంగా చూస్తూ, ''స్వామీ, తమరెవరు? పుణ్యకార్యం చెయ్యనున్న, యీ యువకుణ్ణి ఎందుకు అలా వారిస్తున్నారు?'' అని అడిగాడు.

''పుణ్యకార్యమా?'' అంటూ పద్మపాదుడు నవ్వి, ''నువ్వెవరి వైందీ నాకు తెలియంది కాదు. నిన్ను గురించి సర్వం ఎప్పుడో తెలుసుకున్నాను,'' అన్నాడు.



"ఈ భల్లూకకేతుణ్ణి పట్టి ఇక్కడ రాతికి కట్టి, బంధించిన వాడు మహామాయుడు!" అంటూ పద్మపాదుడు, భల్లూకకేతుడు కేసి తీక్షణంగా చూశాడు.

భల్లూకకేతుడు, ఆ మాట వింటూనే పళ్ళు పట పట కొరికి, "నువ్వెవరు? నా సంగతి నీకెలా తెలుసు? ఆ మహామాయుడి వృత్తాంతం నీకెవరు చెప్పారు? నీవూ మరో మాంత్రికుడివి కాదుగదా?" అన్నాడు.

"అవును. నేనూ మాంత్రికుణ్ణే! నా పేరు పద్మపాదుడు. మహా బలశాలివీ, జిత్తులమారివీ అయిన నిన్ను జయించి, ఇక్కడ కొండరాతికి బంధించిన, ఆ మహామాయుడి సమాధి మీదకు యిప్పుడు నేను దాడికి వెళుతున్నాను," అన్నాడు పద్మపాదుడు.

"నిజమా? మహామాయుడి సమాధి మీదికే దాడి వెళుతున్నారా? అదే నిజమైతే, స్వామీ మీరూ మహామంత్ర వేత్తలయి వుంటారు. మహామాయుడికి బద్ధశత్రువునైన నా సాయం మీకు చాలా ఉపకరిస్తుంది. నన్ను బంధ విముక్తుణ్ణి చేయండి. మీకు ఎల్లకాలం దాసుడుగా వుంటాను," అన్నాడు భల్లూకకేతుడు.

"నీ కల్లబొల్లి మాటలు నమ్మేందుకు నేను అమాయకుణ్ణి కాదు," అన్నాడు పద్మపాదుడు నవ్వుతూ.

భల్లూకకేతుడు జవాబు చెప్పబోయేంతలో, పింగళుడు అందుకుని, "ఇతడి పేరు భల్లూకకేతుడు. మనం వెళుతున్న భల్లూక పర్వతాలకు ఒకప్పుడు, యితడు అధిపతి అట. ఒకానొక మాంత్రికుడి కారణంగా, తనకీ దురవస్థ పట్టిందని చెప్పాడు," అన్నాడు.

"అవును నిజమే, ఒకానొక మాంత్రికుడి వల్లనే యితడికి యీ దుస్థితి కలిగింది. అయినా ఆ మాంత్రికు డెవరో, నువ్వెరుగుదువా, పింగళా?" అని అడిగాడు పద్మపాదుడు.

తెలియదన్నట్టు పింగళుడు తల వూపుతూ, భల్లూకకేతుడి కేసి చూశాడు.




పింగళుడు పద్మపాదుడి దగ్గిరకు వస్తూ, "పద్మపాదా! ఇతణ్ణి మనం రక్షించ వచ్చనుకుంటాను. అడిన మాట తప్పితే తల పగిలిపోతుందని, అతడి కెవరో శాపం పెట్టినట్టు చెప్పాడు," అన్నాడు.

" ఆ మాట నమ్మే, నువు ప్రమాదంలో చిక్కుకునేందుకు సిద్ధమయావు. మహామాయుడి దగ్గిర వున్న మంత్రశక్తిగల వస్తువులు మనవి కానిదే, యీ భల్లూక కేతుణ్ణి మనం విడిపించటం ప్రమాద మవుతుంది. ముందు ఆ వస్తువులను మనవిగా చేసుకున్న తరవాత, ఇతణ్ణి మన దాసుడుగా చేసుకోవచ్చు," అన్నాడు పద్మపాదుడు.

"అయితే, స్వామీ...." అంటూ భల్లూక కేతుడు, ఏమో చెప్పబోయేంతలో, పద్మ పాదుడు అతణ్ణి వారిస్తూ, "భల్లూకా! నీ మెరమెచ్చు మాటలు నన్ను మోసపుచ్చ లేవు. మహామాయుడు సమాధి అయిన పాడుదేవళంలో నేను ప్రవేశించిన తర వాత, నిన్ను బంధవిముక్తుణ్ణి చేస్తాను. అంత వరకూ, నీవు ఇక్కడ వుండ వలసిందే!" అంటూ వెనుదిరిగాడు. పింగళుడు కూడా, అతడి వెనకనే బయలు దేరాడు.

పద్మపాదుడూ, పింగళుడూ అడవి. నుంచి బయటికి వచ్చారు. ఎదురుగా వున్న పచ్చిక బయలులో, వారికి వాహ నాలుగా ఉపయోగించిన గాడిదలు లేవు. పింగళుడు ఆశ్చర్యపోతూ చుట్టూ చూసి, "పద్మపాదా, మన పిశాచ వాహనాలెక్కడ? అవి, యీ ప్రాంతాల మేస్తున్నవను కున్నాను," అన్నాడు.

"అవి గాడిదల రూపంలో వున్న పిశా చాలు కాని, గాడిదలు కావు గదా? అలాం టప్పుడు, వాటికి ఆహారంగా పచ్చిక ఎలా పనికి వస్తుంది? అవి రెండూ ఆహార సంపాదనకు వెళ్ళినై. ఇక, మన ఆహారం సంగతి!" అంటూ పద్మపాదుడు పొట్ట తడువు కుంటూ, అక్కడ మెత్తని కంబ ళిలా వున్న పచ్చికమీద కూలబడ్డాడు.




పింగళుడు కూడా అతడి పక్కనే కూర్చుంటూ, ''అవును, పద్మపాదా! నాకూ ఆకలేస్తున్నది. మనం ఆహారం వెంట తెచ్చుకోవటం మరిచిపోయాం,'' అన్నాడు గాభరాపడుతూ.

పద్మపాదుడు, పింగళుడి వాలకం చూసి నవ్వి, ''పింగళా, అక్కడ వున్న సంచీ అందుకో!'' అంటూ కొంచెం ఎడంగా వున్న సంచీ కేసి చేయిచూపాడు.

పింగళుడు సంచీ తీసుకుని అందులో ఆహారపదార్థాలు వున్నవేమో అని చెయి పెట్టి వెతికి, ఏమీ లేకపోవటం తెలుసుకుని, నిరాశపడ్డాడు. పద్మపాదుడు, సంచీని అందుకుని, ''పింగళా, నీకెలాంటి భోజనం కావాలి? ఎన్ని రకాల కూరలు? కోరుకో!'' అని అడిగాడు నవ్వుతూ.

''ఎన్ని రకాల కూరలో కూడానా? కాలే కడుపుకు యిన్ని పచ్చడి మెతుకులు చాలు. ఆ సంచీలో ఏమీ లేదు. వట్టి కాళీ సంచీ!'' అన్నాడు పింగళుడు.

పద్మపాదుడు సంచీ తెరిచి, అందులోకి ఓమారు తొంగి చూసి, మెల్లిగా ఏదో మంత్రం జపించి, ''పింగళా, సంచీలో యిప్పుడు చూడు!'' అంటూ సంచీని పింగళుడి ముందు పెట్టాడు.

పింగళుడు ఆత్రంగా సంచీలో చేయి పెట్టాడు. అతడి చేతికి వేడి వేడిగా వున్న ఒక వెండిపాత్ర తగిలింది. అది బయటికి తీశాడు. అందులో కళపెళలాడుతున్న అన్నంవుంది. అతడు ఆశ్చర్యపోతూ పద్మపాదుడి కేసి చూశాడు.

పద్మపాదుడు నవ్వి, ''నీకు కావలసిన అన్ని రకాల కూరలూ, పాయసాలూ కూడా ఆ సంచీలో వున్నవి. త్వర త్వరగా బయటికి లాగు,'' అన్నాడు.

పది నిమిషాలు గడిచీ గడవక ముందే, పింగళుడు సంచీలో నుంచి ఇరవైఅయిదు రకాల కూరలూ, పాయసాలూ బయటికి ళాగాడు. బాగా ఆకలిగొని వున్న పద్మపాదుడూ, పింగళుడూ కలిసి త్వరలోనే భోజనం ముగించారు. తరవాత కొంచెం

సేపు విశ్రాంతి తీసుకుని తిరిగి ప్రయాణానికి సిద్ధమయ్యారు.

పద్మపాదుడు చిటికెడు మన్ను తీసుకుని మంత్రించి, భూమిమీద చల్లగానే పెళ పెళమంటూ భూమి బద్దలయింది. అక్కడ నుంచి గాడిదల రూపంలో వున్న రెండు పిశాచాలూ, భీకరంగా ఓండ్రిస్తూ పైకి వచ్చినై. చెరి ఒక వాహనాన్నీ ఎక్కి పద్మపాదుడూ, పింగళుడూ భల్లూక పర్వతాల కేసి బయలుదేరారు.



రెండు, మూడు గంటల ప్రయాణం తరవాత భూమ్యాకాశాలు ఒరుసుకునే చోట, నల్లని పొగలు కమ్ముతున్నట్టుగా ఒక దృశ్యం కనిపించింది. పింగళుడు, అటుకేసి చేయి చూపుతూ, ''పద్మపాదా! ఆ కనబడేవి మబ్బులా లేక పొగలా?'' అని అడిగాడు.

పద్మపాదుడు కొంచెంసేపు అటువైపు పరీక్షగా చూసి, ''పింగళా, అవి మబ్బులూ కాదు, పొగలూ కాదు, భల్లూక పర్వతాలు వున్న ప్రదేశంలో, వాటిని కాపలా కాస్తున్న రాక్షసగణం! బహుశా, అవి మన రాకను గమనించి. మనను భయపెట్టేందుకు ప్రయత్నిస్తున్న వనుకుంటాను,'' అన్నాడు.

పద్మపాదుడు మాట ముగించీ ముగించక ముందే, ఎదురుగా, దాదాపు ఓ యాభై గజాల దూరంలో, మేఘంలాంటి నల్లని పొగ భూమిమీంచి గుండ్రగా సుడులు తిరుగుతూ, క్రమంగా తాటిచెట్టు ప్రమాణంలో పైకి లేచింది. పింగళుడు భయంతో వణికిపోతూ, పద్మపాదుడి కేసి చూశాడు. పద్మపాదుడు ఏదో మంత్రోచ్చారణ చేసి, తను ఎక్కివున్న గాడిదను, అటుకేసి వేగంగా పరిగెత్తించాడు. మరుక్షణాన పొగ ఉన్న చోటు తెలియకుండా మాయమైపోయింది.

పద్మపాదుడు, పింగళుడి కేసి తిరిగి, ''పింగళా, భయపడకు! ఇదిగో, నీకు రక్షణగా, యీ కత్తి యిస్తున్నాను. దీనితో నీవు ఏ రూపంలో నిన్ను ఎదిరించ వచ్చిన

రాక్షసినైనాసరే సంహరించవచ్చు." అంటూ పింగళుడికి కత్తి యిచ్చేంతలో, వారిద్దరి మధ్య వున్న భూమి దద్దరిల్లింది. పద్మపాదుడూ, పింగళుడూ ఎక్కివున్న గాడిదలు రెండూ బెదిరి పక్కలకు పారి పోయినై. మరుక్షణంలో, బారెడేసి దంతాలతో, శరీరమంతా జడలతో అలుముకుని వున్న ఏనుగు ఒకటి, ఘీంకరిస్తూ పింగళుడి మీదికి లంఘించింది. పింగళుడు ఏమాత్రం వెనుకాడక, నిర్భయంగా తన చేతికత్తితో ఏనుగుమీదికి దూకాడు. వెంటనే ఏనుగు బాధతో మూలిగినట్టుగా పెద్ద శబ్దం చేసి, క్షణంలో నల్లని పొగగా మారి, సుడులు తిరుగుతూ దూరంగా పారిపోయింది.

"భేష్, పింగళా, అదీ యువకుడైన వాడు ప్రవర్తించ వలసిన తీరు! దెబ్బకు దయ్యం పారిపోతుందనే సామెత కల్ల గాదు. నీకు, యిచ్చినకత్తిలో ఏమంత్రశక్తి లేదు. కాని, ముందుగా ఆ మాట చెప్పి నట్లయితే, నువ్వు అంత ధైర్యంగా ఆ మాయాగజాన్ని ఎదిరించే వాడివి కాదు. ఇప్పుడు తెలిసిందా? ధైర్యవంతుణ్ణి ఎవరూ లొంగతీసుకోలేరన్న సంగతి!" అన్నాడు పద్మపాదుడు.

పింగళుడు తన చేతనున్న కత్తికేసి ఓమారు ఆశ్చర్యంగా చూసి, పొట్ట చెక్కలయేలా నవ్వుతూ, "యీ కత్తిలో నిజంగా మంత్రశక్తి లేదా? అయినా ఫరవాలేదు. దీనితో నేను వెయ్యిమంది రాక్షసులనైనా



సరేసులభంగా ఎదిరించగలను. జై పాతాళ భూతా!'' అంటూ కత్తిని గాలిలో గిరగిర తిప్పాడు.

పింగళుడు ప్రదర్శించిన ధైర్యసాహసాలు పద్మపాదుణ్ణి ఎంతగానో ఆకర్షించినై. అతడు పింగళుడికేసి ఆప్యాయంగా చూసి, ''పింగళా, మనం భల్లూక పర్వతాలను సమీపించాం. మనం చేరవలసిన నది, యీ పర్వతాల మధ్యగల లోయలో వుంది. కాలినడకను, అక్కడికి చేరాలంటే చాలాకాలం పడుతుంది. ఎక్కేరాయి దిగేరాయి చాలా శ్రమతో కూడిన పని. కనుక, యీ పిశాచ గార్దభాలను కొండల మీదుగా ఎగిరించి, ఆ లోయలో దిగుదాం!'' అన్నాడు.

పింగళుడు అంగీకార సూచకంగా తల వూపేంతలో గాడిదలు రెండూ, గాలిలో లేచినై. అవి కొండ శిఖరాల మీదుగా ఎగురుతూ, క్రమంగా లోయలో గల్ల నది సమీపాన దిగినై. పద్మపాదుడూ, పింగళుడూ తమ తమ వాహనాల మించి దిగారు. మరు క్షణంలో అవి రెండూ మాయమైపోయినై.

పద్మపాదుడు నది ఒడ్డునే కూర్చుని, చేతితో నీళ్ళను కదిలిస్తూ మంత్రం పఠించ సాగాడు. క్రమంగా నదిలో అలలు పుట్టి ఉవ్వెత్తుగా లేస్తూ పొగలు చిమ్మసాగినై. పింగళుడు అమితాశ్చర్యంతో స్థాణువులా ఆ దృశ్యం చూస్తూ కదలా మెదలక అలాగే వుండిపోయాడు.



కొద్దిసేపటి తరవాత పద్మపాదుడు యివతలికి వచ్చి, సంచిలో వున్న గాజు జాడీని తీసుకురావలసిందిగా పింగళుడితో చెప్పాడు. పింగళుడు గాజుజాడీ తెచ్చి, పద్మపాదుడి ముందు పెట్టాడు. అందులో మొసళ్ళ రూపంలో వున్న మహామాయుడి శిష్యులిద్దరి కేసీ పద్మపాదుడు గుడ్లురుముతూ చూసి, "ఇకనైనా మీరు, మీ అసలు రూపాలు ధరిస్తారా? లేక కాల్చి బూడిద చేసి, యీ నదీజలంలో కలపమంటారా?" అంటూ హుంకరించాడు. వెంటనే గాజుజాడీ ఠపీమంటూ పగిలి ముక్కలు చెక్కలుగా గాలిలోకి ఎగిరిపోయింది. నల్లని వికృతాకారులైన ఇద్దరు వ్యక్తులు పద్మపాదుడికి నమస్కరిస్తూ, "మహామాంత్రికా! మేము మీకు దాసానుదాసులం! ఏమిటీ సెలవు?" అని అడిగారు.

"మహామాయుడి సమాధి వున్న పాడు దేవళంలోనికి ప్రవేశం కావాలి. ముందుగా యీ నదిలోని నీరు యింకిపోయేట్టు చేయండి!" అంటూ పద్మపాదుడు కఠినంగా జవాబిచ్చాడు.

మహామాయుడి శిష్యులు ముఖముఖాలు చూసుకుని, జవాబు చెప్పేందుకు తటపటాయిస్తున్నంతలో, పద్మపాదుడు కళ్ళెర్రజేసి, "నా ఆజ్ఞ విన్నారా లేదా?" అని ప్రశ్నించాడు.

మహామాయుడి శిష్యులు వణికిపోతూ, పద్మపాదుడికి నమస్కరించి, "మహామాంత్రికా! ఈ నది యింకిపోవాలన్నా, మహామాయుడి సమాధి వున్న పాడు దేవళంలోకి ప్రవేశించాలన్నా, ముందుగా పింగళుడనే జాలరి యువకుడు ఇక్కడికి రావలసివుంటుంది," అన్నారు.

"అదుగో, యితడే ఆ జాలరి, పింగళుడు!" అంటూ పద్మపాదుడు, పింగళుడి కేసి చేయిచూపాడు.

మహామాయుడి శిష్యులు, పింగళుడి కేసి ఆశ్చర్యంగా చూసి, "మహాప్రసాదం! మీ ఆజ్ఞ యిప్పుడే నెరవేరుస్తాం!" అంటూ అదృశ్యులై పోయారు. —(ఇంకావుంది)






# మృత్యుగండం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, కొందరికి అననుకూల పరిస్థితుల్లో తమశక్తి సామర్థ్యాలు మేలుచేయకపోగా ప్రతిబంధకాలవుతాయి. నీవు అలాంటి కారణాలవల్లనే ఈ అర్ధరాత్రివేళ యింత శ్రమ పడుతున్నావని, నా నమ్మకం. పరులకు ఉపకారం చేయబోయి, నీలాగే చిక్కులపాలయిన రామశాస్త్రి అనే జ్యోతిష్కుడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను.'' అంటూ యిలా చెప్పసాగాడు:

పుష్కర నగరంలో రామశాస్త్రి అనే గొప్ప జ్యోతిశ్శాస్త్ర పండితు డుండేవాడు. ఆయన చెప్పిన మాట అక్షరాలా జరిగిపోతుందని, అంతా చెప్పుకునే వారు.

## బేతాళ కథలు



అయితే, వినయసేనుడికి ఇటీవలనే ఒక కొత్త విశేషం తెలిసింది; యువరాజు సూర్యసేనుడికి విలాస జీవితం పైన మోజుగా వుంటున్నది. అతడి కిప్పట్లో రాజ్యభారం వహించాలని లేదు. అందు వల్ల, అతడు ఆస్థాన జ్యోతిష్కులపై వత్తిడి తీసుకు వచ్చి, తనకు కావలసిన విధంగా తండ్రికి చెప్పించాడు. ఈ పరిస్థితుల్లో జ్యోతిష్కులను నమ్మాలో, నమ్మకూడదో రాజుకు తెలియడం లేదు. ఈ సమయంలో, ఆయనకు రామశాస్త్రిని గురించి తెలిసింది.

వినయసేనుడు తన పరిస్థితిని రామశాస్త్రికి చెప్పి, "పండితవర్యా, ఎటువంటి ప్రలోభాలకూ గురి కాకుండా మీరు, మా యిద్దరి జాతకాలనూ పరిశీలించి సత్యం చెప్పవలసి వున్నది!" అన్నాడు.

రామశాస్త్రి అందుకు అంగీకరించి, ముందుగా రాజు వినయసేనుడి జాతకాన్ని పరిశీలించాడు. తరవాత సూర్యసేనుడి జాతకాన్ని చూసి, రాజుతో, "మహాప్రభూ, ఇది చాలా చిత్రంగా వున్నది! ఈరోజే తమ చిరంజీవికి వివాహం జరగనున్నది, అది ఒక కోయ యువతితో! ముహూర్త సమయం సరిగ్గా అర్ధరాత్రి!" అన్నాడు.

వినయసేనుడు కంగారుపడి, "చిరంజీవి నగరంలో విలాసాలు మరిగాడని,

ఆయన ఖ్యాతి క్రమంగా రాజు దాకా పోయింది. రాజు, రామశాస్త్రికి కబురు పెట్టాడు.

మహారాజు వినయసేనుడికి అరవైఏళ్లు నిండినై. అయినప్పటికీ ఆయన దృఢంగా, ఆరోగ్యంగానే వున్నాడు. ఆయనకు లేక లేక కలిగినవాడు సూర్యసేనుడు. ఇప్పుడు అతడి వయసు ఇరవై సంవత్సరాలు. కొడుక్కు పట్టాభిషేకం చేసి, తాను విశ్రాంతి తీసుకోవాలని రాజు ఆలోచన. కాని, రాజుకు నూరేళ్ల ఆయుర్దాయం వున్నదనీ, రాజ్యభారం స్వీకరించడానికి సూర్యసేనుడి కింకా వయసు చాలదనీ, ఆస్థాన జ్యోతిష్కులు అభిప్రాయ పడుతున్నారు.

నేనే ప్రోత్సహించి నాలుగురోజుల క్రితం అరణ్యానికి వేటకు పంపాను. మీరు చెప్పేది నిజమైతే, ఈ వివాహాన్ని తప్పక ఆపవలసి వున్నది,'' అన్నాడు.

''తక్షణమే ప్రయత్నించండి, ప్రభూ!'' అన్నాడు రామశాస్త్రి.

రాజు స్వయంగా అరణ్యానికి బయలు దేరాడు. అయితే, ప్రయాణానికి ఎన్నో అవాంతరాలు కలిగాయి. దారిలో ఒక చోట బందిపోటు దొంగలను ఎదుర్కొన వలసి వచ్చింది. హఠాత్తుగా గుర్రం జబ్బు పడింది. ఈ కారణాలవల్ల రాజు అర్ధ రాత్రి సమయం దాటిన తర్వాతే యువ రాజును కలుసుకో గలిగాడు. అప్పటికే ఒక కోయపిల్లతో యువరాజుకు వివాహం జరిగిపోయింది!



ఆ రాజవంశం వివాహవ్యవస్థను ఎంత గానో గౌరవిస్తుంది. వివాహం జరిగి పోయింది కాబట్టి, వినయసేనుడికి ఆ కోయపిల్లను కోడలుగానూ, భావిమహా రాణిగానూ అంగీకరించక తప్పలేదు.

తన వివాహం గురించి ముందుగా తండ్రికి ఎలా తెలిసిందని, సూర్యసేనుడు ఆశ్చర్యపడ్డాడు. సేవకులు అతడికి రామ శాస్త్రి గురించి చెప్పారు.

అతడు రాజధాని చేరుతూనే రామ శాస్త్రిని కలుసుకుని, ''మీ ప్రతిభ గురించి విన్నాను. నా మీద యిప్పట్లో రాజ్యభారం పడకుండా చూడవలసిన బాధ్యత, మీది. ఇందుకు ప్రతిఫలంగా మీకు పుష్కలంగా ధనం ఇచ్చుకోగలను, అన్నాడు.

రామశాస్త్రి ఏమీ చెప్పకుండా మౌనంగా వూరుకున్నాడు.

రాజు, రామశాస్త్రిని పిలిపించి ఎంతో దిగులుగా, ''నా కొడుకు, మావంశా చారాన్ని మంటకలిపాడు. ముందు, ముందు మా రాజవంశపు చరిత్ర ఎంత హాస్యాస్పదంగా వుంటుందో అని భయంగా వున్నది,'' అన్నాడు.

''దిగులు పడకండి, మహాప్రభూ! మీ కోడలు అచిరకాలంలోనే రాజమర్యాద

లన్నీ వంట పట్టించుకోగలదు. ఆమె కారణంగానే మీ చిరంజీవి, మీ వంశానికి గొప్పకీర్తి తీసుకురాగలడు. మీరు వెంటనే అతణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేసి, కొంతకాలం పాటు పరిపాలనా విషయాల్లో శిక్షణ ఇవ్వండి.'' అన్నాడు రామశాస్త్రి.

కోడలైన కోయపిల్ల తమ ఆచారవ్యవహారాలను అలవరుచుకునే వరకూ కొడుక్కు రాజ్యాభిషేకం చేయడం వినయసేనుడికి యిష్టంలేదు. అదే ఆయన రామశాస్త్రికి చెప్పాడు. రామశాస్త్రి ఆ ఆలోచన సరికాదన్నాడు.

ఇద్దరి మధ్యా కొంతసేపు వాదం జరిగింది. ఆఖరుకు రాజు, రామశాస్త్రి చెప్పిన ప్రకారమే చేయాలనుకున్నాడు. రామశాస్త్రి నిర్ణయించిన ముహూర్తాన సూర్యసేనుడికి పట్టాభిషేకం జరిగింది. అతడు రాజయ్యాడు.

రాజు కాగానే సూర్యసేనుడు రామశాస్త్రిని పిలిపించి, ''వివాహం కాగానే నేను కొంతకాలం హాయిగా వినోద యాత్రలు చేస్తూ కాలం గడపాలనుకున్నాను. నీ కారణంగా, నాకా అవకాశం లేకుండా పోయింది. ఇందుకు, నీ సంజాయిషీ ఏమిటి?'' అని అడిగాడు.

''మీ తండ్రికి ఒక సంవత్సరంలో ఆయువు తీరనున్నది. సింహాసనం మీద వుండగా కొంత కాలమైనా మీకు, ఆయన సలహా లభిస్తుందని అలా చేశాను,'' అన్నాడు రామశాస్త్రి.



''అన్నీ మీరు చెప్పినట్లే జరగడానికి, మీరేమైనా భగవంతుడా? మీ మూర్ఖత్వం కారణంగా, నా జీవితం సంతోషానికి దూరమయింది. మీకూ అదే గతి పట్టి స్తాను!'' అంటూ సూర్యసేనుడు రామ శాస్త్రికి కారాగారశిక్ష విధించాడు.

ఈ విషయమై తండ్రి వినయసేనుడు ఎంత చెప్పినా అతడు వినలేదు. అప్పుడు వినయసేనుడు కారాగారానికి పోయి రామ శాస్త్రిని కలుసుకుని, ''తలుచుకుంటే నేని ప్పుడు మిమ్మల్ని విడిపించగలను; కానీ చిరంజీవి నొచ్చుకుంటాడు. నన్నేం చేయ మంటారు?'' అని అడిగాడు.

''ప్రభూ, ఈ సమయంలో నాకు కారాగార యోగం వున్నది. రాజాశ్రయం వల్ల ఆ బాధ తొలగిపోతుందనుకున్నాను. నా గురించి మీరు విచారించకండి. త్వరలోనే మీకు మృత్యుగండమున్నది. ఆ విషయమై తగు జాగ్రత్తలో వుండండి!'' అని హెచ్చరించాడు రామశాస్త్రి.

వినయసేనుడు కుమారుణ్ణి కలుసు కుని, ''నీ ధోరణి నాకేమీ నచ్చలేదు. రామ శాస్త్రి మహా పండితుడు. ఆయన నీ వివాహ కాలం గురించి చెబితేనే, దాన్ని ఆపడానికి నేను బయలుదేరి అరణ్యానికి వచ్చాను. నీ భార్య కారణంగా మన వంశానికి గొప్ప పేరు వస్తుందని ఆయనే చెప్పాడు. అందు వల్లనే కోడలంటే నాకు చాలా అభిమానం. ఇప్పుడు నాకు మృత్యుగండం వున్నదని, నిన్ను పట్టాభిషిక్తుణ్ణి చేయమన్నాడు.





ఆయన జ్యోతిశ్శాస్త్రాన్ని నమ్ముకున్నాడు తప్పితే, చేసిన తప్పేమీ లేదు!'' అన్నాడు.

తండ్రి మాటలకు సూర్యసేనుడు ''నేను జ్యోతిషాన్ని నమ్మను. ఆయన గొప్పతనం ఋజువైతే, తప్పక ఆయన్ని వదిలి పెడతాను. ఋజువు కాని పక్షంలో ఆయన్ని శాశ్వతంగా కారాగారంలో వుంచుతాను,'' అని, తండ్రికి ప్రత్యేకమైన రక్షణ ఏర్పాట్లన్నీ చేశాడు.

కొద్ది రోజుల తర్వాత రామశాస్త్రి చెప్పిన మృత్యుగండపు దినం రానే వచ్చింది. ఆరోజు వినయసేనుడు గదినుంచి కదలకుండా ఏర్పాట్లు జరిగాయి. సూర్యసేనుడే ఆయన పక్కన కూర్చున్నాడు. రాజు చుట్టూ ఘనవైద్యులు అద్భుత మూలికలతో ఆసీనులయ్యారు. మృత్యువు ఏ రూపంలో వస్తుందో అని, తండ్రీ కొడుకులిద్దరూ వేయికళ్ళతో కనిపెట్టి చూస్తున్నారు. అది వాళ్ళిద్దరికీ, రామశాస్త్రికీ మాత్రమే తెలిసిన రహస్యం.

సరిగ్గా రామశాస్త్రి చెప్పిన క్షణాన, వినయసేనుడు ఒక పెద్ద కేక పెట్టి తల వాల్చేశాడు. వైద్యులు ఆయన్ని పరీక్షించి, గుండె ఆగడం వల్ల మరణించినట్టు నిర్ణయించారు. జరిగినదేమంటే రాజు శయనించిన మంచంపైన వేళ్ళాడుతున్న దీపగుచ్ఛం మీదికి ఎలాగో ఒక పెద్ద బల్లి చేరింది. ఏ కారణం వల్లనో అది జారి మంచం మీద పడింది. మృత్యుభయంతో వున్న వినయసేనుడికి, తన మీదికి మృత్యువు లంఘించినట్టుగా తోచి, పెద్ద కేకపెట్టాడు. గుండె ఆగిపోయింది.

ఆ సంఘటనకు సూర్యసేనుడు ఆశ్చర్యపోయాడు. అతడు రామశాస్త్రి వద్దకు వెళ్ళి, ''నేను తమ ప్రతిభను అర్థం చేసుకోలేకపోయాను. నన్ను క్షమించండి. మీ జ్యోతిషపాండిత్యంతో, నా పరిపాలనా నిర్వహణలో సాయపడండి!'' అని వేడుకున్నాడు.

ఆ మాటలకు రామశాస్త్రి నవ్వి, ''మహారాజా, జ్యోతిషశాస్త్రం పట్ల మీకు

కలిగిన అభిమానానికి ఆనందిస్తున్నాను. కాని, జ్యోతిష పండితుడుగా, మీకు రాజ్యవ్యవహారాల్లో సహాయం చేయగల శక్తి నాకులేదు, క్షమించండి!'' అని రాజు దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథచెప్పి, "రాజా, రామశాస్త్రిని గురించి నాకు చాలా సందేహాలు కలుగుతున్నవి. అతడు రాజాదరణను తిరస్కరించడం పెద్ద పొరబాటని నేననుకుంటున్నాను. మొదట్లో జ్యోతిషాన్ని ఏమాత్రం నమ్మని రాజు సూర్యసేనుడు యిప్పుడు దానిపట్ల ఎంతో గౌరవాన్ని కనబరిచాడు. ఒకప్పుడు తాను కారాగారంలో పెట్టించిన వ్యక్తినే, తనకు పరిపాలనా వ్యవహారాల్లో సాయపడమని కోరాడు. అలాంటప్పుడు జ్యోతిషపండితుడుగా తాను రాజుకు సాయపడలేనని రామశాస్త్రి అనడం అబద్ధం కాదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రామశాస్త్రి తాను అభ్యసించిన జ్యోతిషశాస్త్రంలో సాటిలేని మహాపండితుడే గాక, గొప్ప నిజాయితీ పరుడు కూడా రాజుకు తన పాండిత్యం ద్వారా సాయపడలేనని అతననడం అబద్ధం కాదు. ఎందుకంటే కోయపిల్లతో యువరాజుకు వివాహం జరగబోతున్నదని ముందుగా చెప్పినా, ముసలిరాజు దాన్ని ఆపలేకపోయాడు. మృత్యుగండాన్ని గురించి కూడా ఇంతే జరిగింది. ముందే తెలిసీ, రామశాస్త్రి కారాగారవాసం తప్పించుకోలేకపోయాడు. ఈ కారణాల వల్ల జరగవలసినదాన్ని ముందు ఎరిగీ తప్పించుకోలేనప్పుడు, జ్యోతిషం వల్ల ప్రయోజనం ఏమిటి? అన్న జిజ్ఞాసలో పడ్డాడు రామశాస్త్రి. అందుకే అతడు రాజాదరణను తిరస్కరించాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అడగడంలో కిటుకు

నీలకంఠదీక్షితులు మంచి పండితుడు. ఆయన పాండిత్యానికి మెచ్చి రాజుగారు చేతులకు సింహతలాటాలు తొడిగారు. ఒక రోజున ఆయన పండితసభకు వెళ్ళి, ఎండలో ఇంటికి తిరిగి వచ్చి, స్నానాలగదికి వెళ్తూ, సింహతలాటాలను అక్కడ వున్న బల్ల మీద పెట్టాడు.

దీక్షితులు స్నానం ముగించి వచ్చి చూస్తే, సింహతలాటాలలో ఒకటి కనిపించలేదు. ఇంట్లోవాళ్ళను విచారించగా, ఆయన దూరపుచుట్టం రంగన్నశాస్త్రి వచ్చి వెళ్ళినట్టు తెలిసింది. అతను కొంచెం చేతివాటు మనిషి. దీక్షితులు యీ దొంగతనం అతడిదే అనుకున్నాడు.

ఆయన అప్పటికప్పుడే బయలుదేరి రంగన్నశాస్త్రి వుండే గ్రామం వెళ్ళి, అతణ్ణి కలుసుకుని, ఆశ్చర్యంనటిస్తూ, "ఔరా, రంగన్నా! రెండు సింహతలాటాలూ ఎత్తుకువచ్చావన్నమాట! రాజుగారు ఎంతో ప్రేమగా యిచ్చినవికదా, వాటిల్లో ఒకటైనా వుంచిపోతే, నీ పుట్టేంమునిగేది?" అన్నాడు.

రంగన్నశాస్త్రి గాభరాపడిపోతూ, "ఇదేం అబద్ధం! రెండు సింహతలాటాలూ నేను తెచ్చానా? నేను తెచ్చింది యిదుగో, ఒకటే!" అంటూ సింహతలాటాన్ని దీక్షితులుకు యిచ్చాడు.

దీక్షితులు తన పథకం పారినందుకు సంతోషిస్తూ, "నీ నీతిమంతనం, నే నెరగందట్రా, రంగన్నా! ఆ రెండోదాన్ని ఎవడో ముచ్చువెధవ ఎత్తుకుపోయి వుంటాడు, వాణ్ణిమాత్రం వదులుతాననుకున్నావా!" అంటూ తిరుగు ప్రయాణమయాడు.

—ఆర్. రేవతి





# ప్రధాన సలహాదారు

ముకుంద నగరానికి రాజు ప్రసేనవర్మ. ఆయన ప్రధాన సలహాదారు శివనాథుడు హఠాత్తుగా చనిపోయాడు. శివనాథుడు, ప్రసేనవర్మకు అన్ని రాజ్యాంగ విషయాల్లోనూ కుడిభుజంగా వుండి సలహాలిస్తూండేవాడు. తిరిగి అంతటి మేధావి తనకు దొరకడేమో అని రాజు విచారపడసాగాడు.

ప్రసేనవర్మకు ముగ్గురు మంత్రులున్నారు. వారిలో ఏ ఒక్కరూ శివనాథుడికి సాటిరాని మాట నిజమే కాని, వాళ్ళు కూడా కొన్ని క్లిష్ట సమయాల్లో ఆయనకు సలహా ఇచ్చినవారే. వారిలో నుంచి ఒక సమర్థుణ్ణి ప్రధాన సలహాదారుగా ఎన్నుకోవాలని నిశ్చయించుకుని, రాజు స్వయంగా వారి మేధాశక్తిని పరీక్షించ దలిచాడు.

ప్రసేనవర్మ ముందుగా విశాలుడనే మంత్రిని పిలిపించాడు. శివనాథుడు మరణించగానే, అనుభవజ్ఞుడైన తనకే ఆ పదవి దక్కుతుందని అతడు కలలు కంటున్నాడు. అందుకు తగినట్టే ప్రసేనవర్మ అతడితో, "మిమ్మల్ని నా ప్రధాన సలహాదారుగా నియమించాలనుకుంటున్నాను," అని చెప్పి, "మన పొరుగు రాజైన సుకేతుడు, మన మీద దండయాత్రకు సన్నాహాలు చేస్తున్నట్టు వేగుల ద్వారా ఇప్పుడే తెలిసింది. అతను అంగబలంలోనూ, అర్థబలంలోనూ కూడా మనకన్న ఎంతో అధికుడు. అతని దాడిని ఎదుర్కొనేందుకు మనమేం చేయాలి?" అని అడిగాడు.

అందుకు విశాలుడు ఒక క్షణం ఆలోచించి, "బలవంతుడైన రాజుతో మనకు విరోధం ఎందుకు, ప్రభూ! అతడితో సంధి చేసుకుంటే జననష్టం, ధననష్టం లేకుండా పోతుంది," అన్నాడు.

బొమ్మిడి అచ్చారావు



"అలా చేయడం అంటే శత్రురాజుకు మనం లొంగిపోయినట్టే గదా! అది మన ప్రతిష్ఠకు భంగకరం. అలాకాక, మనమే ముందుగా అతడిపై మెరుపు దాడి చేసి, అతణ్ణి బందీగా పట్టుకుంటే, అతడు మనకు సామంతుడవుతాడు," అన్నాడు ప్రసేనవర్మ.

విశాలుడు వెంటనే, "అవును, ప్రభూ! తమ ఆలోచన అద్భుతం, అలాగే చేయండి," అన్నాడు.

ప్రసేనవర్మ అతణ్ణి పంపివేసి, ప్రశాంతుడనే మరొక మంత్రిని పిలిపించాడు. అతడి కూడా విశాలుడికి చెప్పినట్టే చెప్పి, "మన ఖజానాకు ఆదాయం క్రమంగా తగ్గిపోతున్న సంగతి, మీరు ఎరగనిది కాదు. దాన్ని ఎలా భర్తీ చేయాలన్న ఆలోచన కలిగింది. అందుకు అనుభవజ్ఞులైన మీ సలహా కోసం పిలిపించాను," అన్నాడు.

"దానికేముంది, ప్రభూ! ప్రజల మీద అదనపు పన్నులు వేద్దాం. ఆ విధంగా ఖజానా నింపుకోవచ్చు," అన్నాడు ప్రశాంతుడు.

ప్రసేనవర్మ చిన్నగా నవ్వి, "ప్రజల మీద మరింతగా పన్నుల భారం మోపితే, వాళ్ళకు మనమీద భక్తి విశ్వాసాలు నశిస్తాయి. ప్రజాక్షేమాన్ని కోరే రాజు అలాంటి పనికి పూనుకోరాదు. మనమే ఖర్చుల విషయంలో శ్రద్ధవహించి పొదుపు చేస్తే, ఖజానాలో వుండవలసిన నిలవధనం అంతగా తరిగిపోదు. ఈ పద్ధతి ఆచరణ యోగ్యమో కాదో మీరే చెప్పండి," అన్నాడు.

ప్రశాంతుడు వినయంగా తలూపి, "మీరు చెప్పింది దివ్యంగా వుంది ప్రభూ! అదే మంచి పద్ధతి," అన్నాడు.

ప్రసేనవర్మ, ప్రశాంతుణ్ణి పంపేసి, మూడవ మంత్రి అయిన శంకరభట్టును పిలిపించి, విశాలుడికీ, ప్రశాంతుడికీ చెప్పినట్టే ప్రధాన సలహాదారు పదవి యివ్వనున్నట్టు చెప్పి, "మన రాజ్యంలోని

దక్షిణ మండలంలో, వానలులేక కరువు పరిస్థితులు ఏర్పడినట్టు వార్తలు అందినై. కరువు నివారణకు బావులు తవ్వించడం అవసరం అనుకుంటున్నాను. మీ సలహా ఏమిటి?'' అని అడిగాడు.

శంకరభట్టు రెండు నిమిషాలు ఆలోచించి, ''మహాప్రభూ, దక్షిణమండలంలో కరువు పరిస్థితులు ఏర్పడడం కాదు, ఇప్పటికే ప్రజలు తిండిగింజలు లేక ఆకలి బాధతో మరణాల పాలవుతున్నట్టు విన్నాను. ఈ సమయంలో వాళ్ళకు కావలసింది, కడుపుకింత తిండి! మీరిప్పుడు బావులు తవ్విస్తూ కూర్చుంటే మరిన్ని దుర్మరణాలు తప్పవు. తమరు వెంటనే ఇక్కడ వున్న ధాన్యపు నిల్వలను దక్షిణ మండలానికి తరలించండి. బావులు తవ్వడం కన్న, దక్షిణ మండల ప్రాంతంలో ప్రవహిస్తున్న జీవనది గాయత్రి జలాలు ఆనకట్టి ద్వారా దక్షిణ మండల మంతటికీ మళ్ళించండి. బావులు తవ్వే ఖర్చు తప్పడమేకాక, ఆ మండల మంతా సస్యశ్యామలమవుతుంది,'' అన్నాడు.

ప్రసేనవర్మ చిరుకోపంగా, ''అయితే మా అభిప్రాయానికి విలువ ఏమాత్రం లేనట్టేనా? మా ఆలోచన సరయినది కాదని, మీ అభిప్రాయమా?'' అని అడిగాడు.

శంకరభట్టు ఏమాత్రం తొట్రుపడకుండా, ''సమయస్ఫూర్తి కలది కాదని



మాత్రం చెప్పగలను, మహారాజా! ఒక పక్క ఇళ్ళు తగలబడుతూంటే, బావులు తవ్వే ప్రయత్నంలాంటిది. నన్ను పిలిచి సలహా అడిగారు కాబట్టి, నేను చెప్ప వలసింది చెప్పాను.'' అన్నాడు.

''మాకు ఆగ్రహం తెప్పిస్తే, నీ గతి ఏమవుతుందో తెలుసా?'' అన్నాడు రాజు కోపంగా.

''ప్రభువులు క్షమించండి! నాకు, తమరు ఇస్తామన్న ప్రధాన సలహాదారు పదవి ఇవ్వరు. బహుశా, మంత్రి పదవి నుంచి కూడా తొలగించవచ్చు.'' అన్నాడు శంకరభట్టు.

ప్రసేనుడు శంకరభట్టును పంపించి వేసి, మర్నాడు సభాముఖంగా ఆయనను తన ప్రధాన సలహాదారుగా నియమిస్తున్నట్టు ప్రకటించాడు.

ఇది విని మంత్రులూ, సభికులూ ఎంతో ఆశ్చర్యపోయారు. మహారాజుకూ, శంకరభట్టుకూ జరిగిన వాగ్వివాదం గురించి వాళ్ళు వినివున్నారు. శంకరభట్టుకు తీవ్రదండన తప్పదని వాళ్ళు అందరు కూడా భావించారు.

రాజు ప్రసేనవర్మ ఆశ్చర్యంగా తనకేసి చూస్తున్న సభికులతో, ''నేను చేసిన నిర్ణయం మీకు ఆశ్చర్యకారణం అయినట్టున్నది. కొత్త ప్రధాన సలహాదారు అన్నిటా శివనాథుడి శక్తి సామర్థ్యాలు కలిగి వుండాలన్నది, నా ప్రయత్నం. నేనొక్కొక్కసారి, నా నిర్ణయాలను వ్యతిరేకించే వారిపట్ల, అనాలోచితంగా కోపం తెచ్చుకుంటాను. అలాంటి సమయాల్లో సలహాదారు రాజ్యక్షేమంకన్న, తన ఉద్యోగభద్రతకే ప్రాధాన్యం ఇవ్వడం జరిగితే, తప్పక ముప్పు వాటిల్లే ప్రమాదం వున్నది. ఎదురైన సమస్యకు, తగిన సలహా యిచ్చి, దానికి కట్టుబడి వుండడం సలహాదారుకు వుండవలసిన ప్రధాన గుణం. అది శివనాథుడిలో వున్నది; యిప్పుడు అదే లక్షణం శంకరభట్టులో వున్నట్టు గుర్తించాను. అందువల్లనే ఆయనకా పదవి లభించింది,'' అన్నాడు.





# నగరాన్ని జయించబోయిన నక్క

పూర్వం ఒకప్పుడు బోధిసత్వుడు వారణాశీ నగరంలోని ఒక గొప్ప పండిత కుటుంబంలో జన్మించాడు. అతడు యుక్తవయస్కుడవుతూనే సర్వ శాస్త్రాలూ అభ్యసించి, నగరంలోని పండితులందరిలోనూ గొప్పవాడనిపించుకున్నాడు. ఆ కారణంగా రాజు అంత చిన్న వయసులోనే ఆయనను తన ఆస్థానంలో ప్రధాన పౌరోహితుడుగా నియమించాడు.

బోధిసత్వుడు తాను శాస్త్రగ్రంథాలు పఠిస్తున్న సమయంలో, ఒక అద్భుతమైన మంత్రాన్ని కనుగొన్నాడు. దాని ప్రభావంతో ఇతరులమీద సర్వాధికారాలు చలాయించవచ్చును. ఆ మంత్రం ఒక్కసారి చదివితే, ఎంతటి వాళ్ళయినా దాసోహం అనవలసిందే!

ఆ మంత్ర ప్రభావంతో ఎవరిపైనా అధికారం నెరపాలని బోధిసత్వుడికి ఆశలేదు కాని, దాన్ని మరిచిపోకుండా జాగ్రత్తపడాలన్న ఆలోచన కలిగింది.

ఇందుకు బోధిసత్వుడు అరణ్యంలోని ఒకానొక ఏకాంత ప్రదేశాన్ని ఎన్నుకున్నాడు. అక్కడ వున్న ఒక ఎత్తయిన రాతిపై కూర్చుని, ఆయన పరిసరాలను చూశాడు. ఎక్కడా మనిషిగానీ, జంతువుగానీ ఆయన కంటబడలేదు.

బోధిసత్వుడు ఆ అద్భుత మంత్రాన్ని గొంతెత్తి చాలాసార్లు చదివి, సూర్యాస్తమయం అవుతూండగా, రాతిమీది నుంచి లేచి, నగరానికి బయలుదేరాడు.

ఆ సమయంలో రాతి వెనుక వున్న బొరియలోంచి నక్క ఒకటి గెంతుతూ బయటికి వచ్చి, "ఓయ్, పండితుడా! నువ్వు చదివిన మంత్రాన్ని, నేను కంఠస్థం చేశాను; వేయి నమస్కారాలు!" అంటూ అక్కణ్ణించి పరిగెత్తసాగింది.



పారిపోతున్న నక్కకు. ఎదురుగా తనకన్న మంచి కండబలం, వాడిపళ్ళూ వున్న నక్క ఒకటి రావడం కంటబడింది. వెంటనే అది మంత్రం చదివింది. ఎదురు వస్తున్న నక్క దానికి వంగి నమస్కరించి, ఎంతో అణకువగా దారి తొలిగింది. మంత్రం నేర్చిన నక్కకు ఎక్కడలేని ఆనందం కలిగింది.

ఈ విధంగా నక్క కొద్దిరోజుల్లో ఎన్నో వందల నక్కలపై అధిపత్యం సంపాయించింది. తరవాత అది తన మంత్ర శక్తిని అడవి పందుల మీదా, పులులూ, సింహాలూ, ఏనుగులపై ప్రయోగించి, వాటన్నిటినీ లోబరుచుకున్నది. ఆ జంతువులన్నీ నక్కను తమ రాజుగా అంగీకరించి, గొప్ప ఉత్సవం జరిపినై.

రాజు నక్క, ఒక ఆడనక్కను వివాహమాడి, దాన్ని రాణీగా ప్రకటించింది. సింహాలూ, పులులలో నుంచి కొన్నింటిని మంత్రులుగా, సేనానాయకులుగా ఎన్నిక చేసింది. ఇన్ని అరణ్యమృగాలు తన ఆజ్ఞలను శిరసావహిస్తూ, తనకూ, తన భార్యకూ సేవలు చేస్తూండడం దానికి ఎక్కడలేని గర్వాన్ని కలిగించింది.

రెండు ఏనుగులను పక్క పక్కన నిలబెట్టి, వాటిపైన సింహాన్ని నిలిపి, దానిపైన రాజునక్క ఆసీనురాలయేది.

నక్కలాంటి హీనప్రాణి అంత శక్తివంతమైన మంత్రం నేర్చుకోవడం చూసి, బోధిసత్వుడు ఎలా అయినా దాన్ని పట్టుకోవాలని వెంటబడ్డాడు. కాని, అప్పటికే చీకటి కమ్ముతున్న కారణంగా దాపుల వున్న పొదలచాటున నక్కుతూ, అది పారిపోయింది.

ఈ నక్క అంతకు పూర్వజన్మలో బ్రాహ్మణుడుగా పుట్టి, బతికినన్నాళ్ళూ అమితమైన జిత్తులమారి తనంతోనూ, పరులకు హానిచేస్తూనూ కాలం వెళ్ళబుచ్చింది. ఆ మానవజన్మ కారణంగా దానికి మంత్రానికి వున్న అద్భుతశక్తి తెలిసి పోయింది.

కొన్ని జంతువులు, దాన్ని మించిన రాజు ప్రపంచంలో లేడంటూ విపరీతంగా పొగడసాగినై.

నక్కకు ఇవన్నీ వింటూంటే ఆనందంతో పాటు గర్వం కూడా అధికంకాసాగింది. "ఈ జంతువులకు రాజునన్న తృప్తితో ఎందుకు కాలం గడపాలి? ఏకంగా వారణాశీ నగరాన్నే ఎందుకు జయించ కూడదు?" అన్న ఆలోచన దానికి కలిగింది.

కొద్ది రోజుల్లోనే అది మృగాల్లో సాటిలేని బలంగల సింహాలనూ, కొద్దిపాటి ఇతర జంతువులనూ సైన్యంగా సమకూర్చుకుని వారణాశీ నగరం పైకి దాడివెళ్ళింది. అవి రావడం దూరాన్నుంచి చూసిన నగరవాసులు కొందరు భయకంపితులై, నగర వీధుల్లో పరిగెత్తుతూ, ఈ వార్తను ప్రజలకు తెలియబరిచారు. నగరంలో కల్లోలం ప్రారంభమయింది.

రాజునక్క నగర ద్వారం చేరి, చావు భయంతో వణికిపోతున్న కాపలావాళ్ళతో, "ఒరే, మీరు తక్షణం పోయి, మీ రాజును లొంగిపొమ్మని చెప్పండి. అలా లొంగక పోయాడో, నా సైన్యంతో మీ నగరం మీద దాడి చేయగలను," అన్నది.

కాపలావాళ్ళ ద్వారా ఆ సంగతి విన్న రాజుకు ఏమిచేయాలో పాలుబోలేదు. బోధిసత్వుడు ఆయనతో, "మహారాజా, ఈ సమస్యను పరిష్కరించే పని నాకు వదలండి," అన్నాడు.



తరవాత ఆయన కోటగోడ మీదికి పోయి, నక్కరాజును, "నగరాన్ని ఎలా జయించదలిచావు?" అని అడిగాడు.

రాజు నక్క పెద్దగా నవ్వి, "ఆ పని చాలా తేలిక! నా సైనిక సింహాలన్నీ ఏక కంఠంతో ఒక్కసారి గర్జించితే, నీ సైనికులూ, పౌరులూ ప్రాణభయంతో చెల్లా చెదురుగా పారిపోతారు," అన్నది.

బోధిసత్వుడికి నక్క మాటలు అబద్ధం కాదని తోచింది. ఆయన గోడదిగువ నున్న రాజోద్యోగులతో, "మీరు వెంటనే వెళ్ళి, నగరవాసులందర్నీ తమ చెవుల్లో దూది పెట్టుకోవలసిందిగా చెప్పండి," అన్నాడు.

ఆ పని పూర్తి కాగానే ఆయన రాజు నక్కతో, "నగరాన్ని జయించేందుకు నువ్వేంచేయదలిచావో చెయ్యి!" అన్నాడు.

రెండు ఏనుగులపై నిలబడిన సింహం మీద కూర్చుని వున్న రాజునక్క, సింహాలన్నిటినీ ఒక్కసారిగా భయంకర గర్జన చేయమని ఆజ్ఞాపించింది. ఆ మరుక్షణం పరిసరాలన్నీ దద్దరిల్లిపోయేలా సింహాలు గర్జించినై. తమ చెవి రంధ్రాలను దూదితో దట్టించిన కారణం వల్ల నగరవాసులకు సింహగర్జనలేవీ వినిపించలేదు. కాని, ఆ గర్జనలు వింటూనే రాజునక్కను మోస్తున్న రెండు ఏనుగులూ ఎగిరి గంతు వేసినై. దానితో వాటిమీద నిలబడి వున్న సింహం కిందపడింది. ఏనుగులు భీతిల్లి పరిగెత్తుతూ తమ కాళ్ళతో రాజునక్కను చితకతొక్కనై. మిగిలిన మృగాలు భయపడి పారిపోతూ, ఒక దాన్నొకటి తొక్కుకుని కొన్ని చావగా, కొన్ని అరణ్యం చేరినై.

ఈ జరిగినది చాటింపు ద్వారా తెలుసుకుని నగరవాసులు తమ చెవులలో దట్టించిన దూదిని తీసి వేశారు. ముంచుకు వచ్చిన ఆపద తప్పిపోయినందుకు వాళ్ళందరూ ఎంతో సంతోషించారు.

రాజుతోపాటు నగరవాసులందరూ, తమను యింత ఘోరమైన ఆపదనుంచి కాపాడిన బోధిసత్వుడికి తమ కృతజ్ఞత తెలియజేశారు.





# అక్బర్ చక్రవర్తి - 2

ఆగ్రా సమీపంలోని సిక్రి సుందర ప్రాంతంలో చిన్న కొండ మీద షేక్ సలీంచిస్టీ అనే సాధువు నివసిస్తూండే వాడు. ఆయన మీద అక్బర్‌కు అమితమైన భక్తిప్రపత్తులు వుండేవి.

1569 వ సంవత్సరంలో అక్బర్, రాజపుత్ర రాణి కొడుకును కన్నది. సాధువు షేక్ సలీం ఆశీర్వాదం కారణంగానే తనకు కొడుకు పుట్టాడని విశ్వసించిన అక్బర్, తన బిడ్డకు సలీం అని నామకరణం చేశాడు. అక్బర్ తర్వాత ఈ యువరాజే మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించాడు.





సాధువు సలీం గౌరవార్థం అక్బర్, సిక్రిలో ఒక కోట నిర్మించాడు. అక్కడ బ్రహ్మాండమైన రాజ ప్రాసాదం నిర్మించి, దాన్నే తన రాజధానిగా చేసుకున్నాడు. ఈ కోట నుంచే ఆయన గుజరాత్ మీదికి దండెత్తి విజయం సాధించాడు. అప్పటినుంచీ సిక్రి, ఫతేపూర్ (విజయనగరం) సిక్రిగా పేరు గాంచింది.



1593 వ సంవత్సరంలో అక్బర్ అహ్మద్‌నగర్ మీదికి దాడి జరిపాడు. అప్పటికే అహ్మద్‌నగర్ రాజు మరణించాడు. రాజు తర్వాత అతని సోదరి బిజాపూర్ రాణి చాంద్‌బీబీ అహ్మద్‌నగర్‌ను పరిపాలిస్తున్నది. చాంద్‌బీబీ మొగల్ సేనలను ఎదుర్కొన్నది.

మొదట అక్బర్ సేనలతో ధైర్యంగా పోరాడిన చాంద్‌బీబీ, ఆ తర్వాత అసంఖ్యాకమైన మొగల్ సేనల ధాటికి తట్టుకోవడం కష్టమని గ్రహించింది. అందువల్ల, మొగలులు అహ్మద్‌నగర్‌ను శాంతియుతంగా వదిలివేసే పక్షంలో, బీరార్‌ను వారికి అప్పగించడానికి అంగీకరించి, రాయబారం పంపింది.





మొగలు సేనలు మరలిపోయాయి గాని, చాంద్‌బీబీ నిర్ణయం, అహ్మద్‌నగర్ ప్రముఖులు కొందరికి ఏమాత్రం నచ్చకపోవడంతో ఆమెను హత్య చేశారు. దాని ఫలితంగా అహ్మద్‌నగర్ పూర్తిగా మొగలుల వశమయింది.

అచిరకాలంలోనే అక్బర్ సువిశాలమైన సామ్రాజ్యాన్ని స్థాపించడమే గాక, గొప్ప పరిపాలనా దక్షుడిగా పేరు గాంచాడు. ఆయన మంత్రి అబుల్ ఫజల్ అక్బర్ పరిపాలనా విధానాలను వివరించే ఐన్-ఇ-అక్బరీ అనే చారిత్రక గ్రంథం రాశాడు.





మంత్రి బీర్‌బల్, ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు తాన్‌సేన్, కవి అబుల్ ఫైజీ, భూ సంస్కరణలు ప్రవేశపెట్టిన తోడర్‌మల్ మొదలైన ప్రముఖులు అక్బర్ ఆస్థానంలో వుండేవారు.

వివిధ మతాలు మనిషికీ, మనిషికీ మధ్య భేదాలను సృష్టిస్తాయని గ్రహించిన అక్బర్—సర్వమత సమన్వయమైన దీన్-ఇల్లాహి అనే నూతన మత సిద్ధాంతాన్ని రూపొందించాడు. కాని ఆ మతం అట్టేకాలం నిలబడలేక పోయింది.





మహాసామ్రాజ్యాధినేత అయినప్పటికీ, అక్బర్ అంతిమదశలో విషాద సంఘటనలను ఎదుర్కోవలసి వచ్చింది. వాయువ్యసరిహద్దులో బీర్‌బల్ చంపబడ్డాడు. యువరాజు సలీం ప్రోద్బలంతో అక్బర్ ఆప్తమిత్రుడైన అబుల్ ఫజల్ దారుణంగా హత్య చేయబడ్డాడు. ఆ ఇరువురి మరణాలూ అక్బర్‌కు విషాదాన్ని కల్గించాయి.

ఇంగ్లండును పరిపాలించిన మొదటి ఎలిజబెత్ రాణి దగ్గరి నుంచి, జాన్ న్యూబెరీ నాయకత్వంలో ముగ్గురు అధికారులు వచ్చి అక్బర్‌ను కలుసుకున్నారు. ఈ ముగ్గురే మొట్టమొదట భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయాధికారులు.





అక్బర్ ఎంతగానో అభిమానించిన రాజధానీ నగరం ఫతేపూర్ సిక్రీ నీటి ఎద్దడి కారణంగా, ఎంతోకాలం కొనసాగలేక పోయింది. బ్రహ్మాండమైన రాజప్రాసాదాన్ని అక్బర్ వదలలేక వదిలిపెట్టాడు. యువరాజు సలీం ప్రవర్తనకు మరింత బాధపడిన అక్బర్ 1605వ సంవత్సరంలో మరణించాడు.



# యువరాజు-భూతం

బొగ్దాద్ పాలకుడు సుల్తాన్ హమీద్‌కు ఒక్కడే కొడుకు. అతడిపేరు అబ్దుల్ హసన్. అతడు మంచి అందగాడే కాక, ధైర్యశాలి కూడా. అతడికి యుక్తవయసు రాగానే తండ్రి అతణ్ణి యువరాజుగా ప్రకటించదలచి, ఆ సంగతి హసన్‌కు చెప్పాడు.

హసన్ తండ్రితో, ''నేను యువరాజుగా కొంత పరిపాలనా బాధ్యత స్వీకరించే ముందు, ఒకసారి రాజ్యంలోని అన్ని ప్రాంతాలూ చూడాలను కుంటున్నాను,'' అన్నాడు.

సుల్తాన్ అందుకు సరేనని, ''లోకంలో చాలా మంచి మనుషులున్నట్టే, పరమ దుష్టులు కూడా వుంటారు. ఈ ప్రయాణంలో నీకు తోడుగా మన వజీర్‌తోపాటు, మరి కొందరు నౌకర్లను కూడా పంపుతాను,'' అన్నాడు.

ఆ ప్రకారమే హసన్ వెంట వజీరూ, ఆయుధ ధారులైన పదిమంది నౌకర్లూ బయలు దేరారు. వాళ్ళు నెల రోజులపాటు రాజ్యంలోని అనేక ప్రాంతాలు తిరిగి, బాగ్దాదుకు ప్రయాణమయ్యారు. దారిలో వారికొక కొండప్రాంతం తగిలింది. అక్కడ కొండదిగువున ఒకచోట నౌకర్లు గుడారాలు వేశారు.

హసన్ తనకు నిర్మించిన గుడారం ప్రవేశించుతున్నంతలో వజీరు గుర్రాన్ని వేగంగా దౌడుతీయిస్తూ అక్కడికి వచ్చి, గుర్రందిగి, ''ప్రభూ. మీకు అంతగా ప్రయాణ బడలిక లేకపోతే, నావెంట రండి. ఒక అద్భుతమైన లేడిని చూపిస్తాను,'' అన్నాడు.

''మనం ఎన్ని లేళ్ళను చూశాంకాదు! నువ్వనే లేడిలో వున్న విశేషం ఏమిటి?'' అని అడిగాడు హసన్.



''ఆహా, ఇది కలా నిజమా! ఈ లేడి వుండవలసింది, క్రూరమృగాలు తిరిగే యీ కొండ ప్రాంతంలో కాదు, మన ఉద్యాన వనంలో,'' అంటూ గుర్రాన్ని అదిలించి దాన్ని పట్టుకునేందుకు బయలు దేరాడు. కాని, లేడి అతడికి దొరకకుండా లోయలో అటూ, యిటూ తిప్పి, చివరకు కనబడకుండా పోయింది.

హసన్ చాలాసేపు దానికోసం చుట్టు పక్కల వెతికాడు. కాని, ప్రయోజనం లేకపోయింది. అతడు నిరుత్సాహంగా తన గుడారాల కేసి బయలుదేరాడు. దారిలో ఒకచోట అతడికి ఒక శిథిలమైన కోట కనిపించింది. అక్కడ ఒక గోడనానుకుని ఒక యువతి దుఃఖిస్తున్నది. ఆమె అద్భుత సౌందర్యవతి.

హసన్ ఆమెను సమీపించి, ''ఈ నిర్జన ప్రదేశంలో ఎందుకు దుఃఖిస్తున్నావు? అసలు ఇక్కడికి రావలసిన అవసరం ఏం కలిగింది?'' అని అడిగాడు.

ఆమె అతడికేసి వింతపడుతున్నట్టు చూసి, ''ఇన్నాళ్ళకు తోటిమనిషి మరొకర్ని చూడగలిగాను! నేను ఇక్కడికి తూర్పుగా వున్న ఇరవాన్ దేశపు రాజకుమార్తెను. వారం రోజులక్రితం నేను చెలికత్తెలతో నదికి పోయి స్నానం చేసి, రాజభవనానికి తిరిగి వస్తూండగా, మేఘాల్లోంచి ఒక

''నేను చెప్పే, యీ లేడి శరీరం బంగారు మలాం అద్దినట్టున్నది. చక్రాల్లాంటి దానికళ్ళు, నక్షత్రాల్లాగా మెరుస్తున్నవి. ఇక దాని గిట్టలమాట చెప్పనే అవసరం లేదు; సానపట్టిన మణుల్లా ధగధగలాడుతున్నవి,'' అన్నాడు వజీరు.

హసన్ గుర్రంఎక్కి వజీరు ముందుండి దారిచూపగా వేగంగా కొండకేసి బయలు దేరాడు.

వజీరు అతణ్ణి ఒక లోయ ప్రాంతానికి తీసుకు పోయాడు. లోయకు ఎదురుగా వున్న పచ్చిక బీడులో వజీరు చెప్పిన వింతలేడి వాళ్ళకు కనిపించింది. హసన్ దాన్ని చూసి ఒకక్షణం నివ్వెర పడిపోయి

భూతం వాయువేగంతో వచ్చి నన్ను చేత్తో పట్టుకుని పైకెగిరింది. అది మేఘాల్లో కొంత దూరం ప్రయాణించాక, హఠాత్తుగా పిడుగొకటి దాని వీపును తాకింది. ఆ మరు క్షణం భూతం భగ్గున మండిపోయింది. నేను ఇక్కడకొచ్చి పడ్డాను," అన్నది.

"ఇలాంటి అద్భుత కథ, నే నేనాడూ వినలేదు!" అంటూ హసన్ ఆశ్చర్యపోయి, "నిన్ని నిర్జనప్రాంతంలో వదిలి పోవడం ధర్మం కాదు. గుర్రం మీద నా వెనుక కూర్చోవడం నీకు అభ్యంతరం లేకపోతే నిన్ను నా గుడారానికి తీసుకుపోతాను. అక్కడి నుంచి మనం బాగ్దాదునగరం చేరవచ్చు, తరవాత నిన్ను తగిన రక్షణలో నీ తలిదండ్రుల వద్దకు పంపుతాను," అన్నాడు.

యువతి అతడికి తన కృతజ్ఞత చెప్పుకుని, హసన్ వెనకగా గుర్రం మీద కూర్చున్నది. ఆ సమయంలో సూర్యాస్తమయి నలుదిక్కులా చీకట్లు కమ్మసాగినై. హసన్ తాను వదిలివచ్చిన గుడారాలకేసి బయలుదేరాడు.

దారిలో ఒకచోట అతడికి తన వెనకనుంచి ఎవరో వికృతంగా నవ్విన ధ్వని వినిపించింది. హసన్ తల తిప్పి చూశాడు. ఇప్పుడు గుర్రం మీద అద్భుత సౌందర్యవతి అయిన యువతికాక, పరమ



వికృతాకారిణి అయిన భూతం వున్నది. హసన్ శరీరం జలదరించింది. అతడు గుర్రం మీద ఒకపక్కకు ఒరిగిపోయాడు.

భూతం అతణ్ణి సరిగా కూర్చోబెట్టి, "ఎందుకలా భయంతో వణికిపోతున్నావు?" అని అడిగింది.

"నేను ప్రాణాపదలో వున్నానని, నీకు తెలియందికాదు!" అన్నాడు హసన్.

"ఒక గొప్ప దేశపు యువరాజుకు ప్రాణభయమా? ఎందువల్ల? నీ సైన్యానికి ఆజ్ఞ యిస్తే, నిన్ను రక్షించలేదా?" అని అడిగింది భూతం.

"ఇప్పటిస్థితిలో సైన్యం ఎందుకూ కొరగాదు," అన్నాడు హసన్.

"నీ సంపద మాటేమిటి? దాన్ని ఉపయోగించి ప్రమాదం నుంచి బయట పడలేవా?" అన్నది భూతం.

"అదిసాధ్యపడదు." అన్నాడు హసన్.

"నీ బలశౌర్యాలూ, కీర్తి ప్రతిష్ఠల మాటేమిటి?" అన్నది భూతం నవ్వుతూ.

"అవి నన్నీ చిక్కు నుంచి కాపాడ లేవు," అన్నాడు హసన్.

"అలాగా! అయితే, ఎవరు నిన్ను రక్షించగలరను కుంటున్నావు? నిజంగా అలాంటి వారెవరూ లేరా?" అంటూ భూతం మరొకసారి నవ్వింది.

హసన్ కొంచెంసేపు ఆలోచించి, "దేవు డొక్కడే నన్ను కాపాడే సమర్థుడు," అన్నాడు.

"అయితే, ఆయనెందుకు ప్రార్థించవు?" అన్నది భూతం.

వెంటనే హసన్ గొంతెత్తి, "దేవా, నన్ను రక్షించు!" అంటూ కేకపెట్టాడు. మరు క్షణం భూతం గుర్రం మీది నుంచి కింద పడింది. అది పడినచోట భగ భగమంటూ మంటలు లేచినై. ఒకటి రెండు క్షణాల తరవాత ఆ ప్రదేశాన ఒక బూడిదకుప్ప మాత్రం మిగిలింది.

వింతలేడి, అందమైన యువతిగా, ఆ యువతి భూతంగా మారడానికి కారణం-ఒక అమానుషశక్తి! ఆ అమానుష దుష్ట శక్తిని వజీరు, యువరాజు హసన్‌ను చంపేందుకు ఉపయోగించుకోవాలని చూశాడు. కాని, అది హసన్ మీద జాలి కొద్దీ తన ప్రశ్నలతో అతడు దేవుణ్ణి స్మరించేటట్టు చేసింది. ఈ విధంగా తాను నశించి, హసన్‌ను కాపాడింది.

హసన్ వేగంగా తన గుడారం వున్న చోటుకు వచ్చాడు. అతణ్ణి అంతదూరాన గుర్రం మీద చూస్తూనే దుష్టుడైన వజీరు, తనకు చావు తప్పదని శంకించి కొండల్లోకి పారిపోయాడు. అతణ్ణి ఆ తర్వాత చూసిన వారెవరూలేరు.

ఈ అనుభవంతో హసన్ మనుషుల స్వభావాన్ని, మరింత బాగా అర్థం చేసుకుని సంతోషంగా బాగ్దాద్ నగరం చేరాడు.





# సాధువర్తన

నిత్యానందుడు అనే సాధువు దేశ సంచారం చేస్తూ, కోమలపురం అనే గ్రామం చేరుకున్నాడు. అది వేసవిమిట్ట మధ్యాహ్న సమయం. మండుటెండలో నడవడంవల్ల దాహంతో అతడి నాలుక పిడచకట్టుకు పోయింది. ఆయన ఒక ఇంటి తలుపు తట్టి, ఇంటావిడ తలుపు తీయగానే, దాహం తీర్చుకునేందుకు మంచి నీళ్ళడిగాడు.

ఆమె ఒక చెంబు నిండుగా నీళ్ళు తెచ్చి నిత్యానందుడి కిచ్చింది. ఆయనకు వాటితో దాహం తీరక మరికొంత కావా లన్నాడు.

ఇంటావిడ మరొక చెంబు నీళ్ళు తెచ్చి యిచ్చింది. నిత్యానందుడు దాహం తీర్చుకుని, ఆమెను దీవించి అక్కడికి దాపులనే వున్న చెరువుగట్టు మీది రావిచెట్టు కింద కూర్చున్నాడు.

చెరువులో నీళ్ళు లేవు; అది పూర్తిగా ఎండి బాగా బీటలు వారి వున్నది. రావి చెట్టు ఆకులు కూడా పచ్చదనం మాసి, గాలి తాకిడికి గలగలలాడుతున్నవి.

ఆ నాటివరకూ నిత్యానందుడికి ప్రతి గ్రామంలోనూ ఎంతో ఘనంగా ఆతిథ్యం లభించింది. కోమలపురంలో కూడా తప్పక అలాంటి ఆతిథ్యం లభిస్తుందనుకున్నాడు. కాని, సాయంత్రం అయినా అయన్ని గ్రామస్థులెవరూ తమ ఇళ్ళకు ఆహ్వానించలేదు.

నిత్యానందుడు ఆ రాత్రి తన వెంట తెచ్చుకున్న ఫలాలతో ఆకలి తీర్చుకుని, ఉదయాన నిద్ర లేస్తూనే, కొంచెందూరాన కొండపాదంలో వున్న కాంచనపురం అనే గ్రామానికి బయలుదేరాడు. దారిలో ఆయనకు చిదానందు డనే సాధువు ఎదురయ్యాడు.

రాంబాబు



ఒకనాటి సూర్యోదయంవేళ చెరువుకు స్నానానికొచ్చిన సాధువులిద్దరూ ఒకరి నొకరు పలకరించుకున్నారు.

"ఆ రోజు నా మాట వినక మీరు కోమలపురం వెళ్ళారు. అక్కడ ఆతిథ్యం దొరక్క అవస్థలపాలై వుంటారు, అవునా?" అని అడిగాడు నిత్యానందుడు, చిదానందుణ్ణి.

"అలాంటిదేం లేదు. గ్రామస్థులు నాకు ఘనంగా ఆతిథ్యం యిచ్చారు. వాళ్ళు చూపిన ఆదరం, గౌరవమర్యాదలు ఎన్నటికీ మరవరానివి," అన్నాడు చిదానందుడు.

"అలాగా! అయితే, నేను చేసుకున్న పాపమేమిటి?" అంటూ నిత్యానందుడు ఆశ్చర్యపోయాడు.

"కోమలపురం గ్రామంలోకి వెళ్ళా లంటే మనం చాలాదూరం చెరువుగట్టు మీదుగానే నడవాలి. మీరూ అలాగే వెళ్ళారు గదా? అప్పుడు చెరువు ఎండిపోయి బీటలువారి వున్న సంగతి మీరు గమనించ లేదా?" అని అడిగాడు చిదానందుడు ఆశ్చర్యంగా.

"గమనించకేం, గమనించాను. దానికీ, నాకు గ్రామస్థులు ఆతిథ్యం యివ్వకపోవ డానికీ సంబంధం ఏమిటి?" అన్నాడు నిత్యానందుడు.

ఇద్దరూ ఒకరినొకరు పరిచయం చేసు కున్నాక, నిత్యానందుడు చిదానందుణ్ణి ఎక్కడికి వెళుతున్నారని అడిగాడు. చిదా నందుడు తాను కోమలపురం పోతున్నట్టు చెప్పాడు.

"మీరు ఆ గ్రామం వెళ్లకండి. అక్కడి ప్రజలకు మనలాంటి సాధువులంటే ఆదరణ లేదు. మీరు చాలాయిబ్బందుల పాలుకావలసి వస్తుంది," అని నిత్యా నందుడు తన అనుభవం చెప్పాడు.

చిదానందుడు ఆయన మాట వినక కోమలపురం వెళ్ళి, అక్కడ వారం రోజులు గడిపి కాంచనపురానికి తిరిగి వచ్చాడు.

"చాలా ముఖ్య సంబంధమే వున్నది! ఆ ఎండిన చెరువును చూస్తూనే మీరు, గ్రామస్థులు తాగే నీరులేక బాధపడుతున్నారని గ్రహించవలసింది. అలాకాక, మీరు గ్రామం ప్రవేశిస్తూనే దాహం అడిగారు!" అన్నాడు చిదానందుడు.

"ఏం చేసేది? మండుటెండలో నేను ఎంతోదూరం నుంచి నడిచి వస్తున్నాను. ఆ గ్రామం చేరేసరికే నాలుకపిడచ కట్టుకుపోయింది," అన్నాడు నిత్యానందుడు అమాయకంగా.

"ఆ మాట నిజమే. కాని, ఆ గ్రామస్థులకు చాలాకాలంగా నీటికొరత ఏర్పడింది. తాగే నీటికోసం కోసెడు దూరం వెళ్ళి వస్తున్నారు. మనబోటి సాధు సన్యాసులంటే ఎవరికైనా భక్తి గౌరవాలుండడానికి కారణం, మనం వాళ్ల కష్టాలు తీరేందుకు ఏదైనా మార్గం చూపుతామని. అంతేగాని మనం వాళ్ళపై అధికారులం ఏం కాదు గదా!" అన్నాడు చిదానందుడు.

"నిజమేననుకోండి. మరి, మీరా గ్రామస్థుల నుంచి ఎలా ఆతిథ్యం పొందగలిగారు?" అని అడిగాడు నిత్యానందుడు కుతూహలంగా.

"నా పెద్ద కమండలంలో రెండు, మూడు రోజులకు సరిపడా మంచినీళ్ళు వెంట తీసుకుపోయాను. అంతకుముందు కొద్దిరోజులపాటు కోమలపురం దాపులనున్న కొండ ప్రదేశం తిరిగి, రాళ్ళ మరుగున వున్న ఒక నీటిధారను కనుగొన్నాను. ఆ సంగతి గ్రామస్థులకు చెప్పాను. వాళ్ళిప్పుడు ఆ నీటిధార నుంచి చిన్న కాలవ తవ్వి, ఎండిపోయిన తమ చెరువును నీళ్ళతో నింపుకొంటున్నారు," అన్నాడు చిదానందుడు ఉత్సాహంగా.

నిత్యానందుడు తలవంచి చిదానందుడికి నమస్కరించి, "ఎంతో కాలంగా దేశాటనచేస్తున్న నాకు, మీ పరిచయ కారణంగా సాధువర్తన అంటే ఎలా వుండాలో, యీ నాడు తెలిసింది!" అన్నాడు.






# అత్తా-కోడలు

రంగపురంలో వుండే అనసూయమ్మ, మంగపతులకు గిరీశం, సత్యం యిద్దరే కొడుకులు. గిరీశానికి రంగపురంలోనే, ఒక షావుకారు దగ్గిర ఉద్యోగం దొరికింది. సత్యం పట్నంలోని ఒక నాటకశాలలో గాయకుడుగా, నటుడుగా పెద్ద జీతం మీద స్థిరపడిపోయాడు.

గిరీశం, సత్యాలకు; సుమతి, లక్ష్మి అనే సామాన్య కుటుంబీకుల పిల్లలతో వివాహం జరిపి, తమ బాధ్యత తీరిందనుకున్నారు తలిదండ్రులు. వాళ్ళు కొంత కాలం గిరీశం ఇంట్లోనూ, కొంతకాలం సత్యం ఇంట్లోనూ వుంటూండేవారు.

వాళ్ళు గిరీశం యింట్లో వుంటున్నప్పుడు ఒకనాడు పట్నంలో సత్యానికి జ్వరంగా వున్నట్టు కబురందింది.

ఆ వార్త వింటూనే అనసూయమ్మ, కోడలు సుమతితో, "సత్యం ఆరోగ్యం అప్పుడప్పుడూ యిలాగే చెడుతూ వుంటుంది. వాడికి ఏపాటి చిన్న జ్వరం వచ్చినా తట్టుకోలేడు. ఇలాంటి సందర్భాలలో పెద్దవాడు గిరీశం చాలా ధైర్యంగా వుంటాడు. మీ మామగారికి యిలాంటివి పట్టవు. నేను వెళ్ళి, వాడికి ధైర్యంచెప్పి, జ్వరం తగ్గగానే తిరిగి వస్తాను," అని పట్నం వెళ్ళింది.

ఆ రాత్రి సుమతి, భర్త గిరీశంతో, "చూశారా, మీ అమ్మగారి పక్షపాతం! బాగా సంపాయిస్తున్నాడనేగదా ఆమెకు చిన్నకొడుకుపై అంత అభిమానం. జ్వరం తగిలిందని కబురు రావడమే తడవుగా పరిగెత్తింది. మీ మీద అంత అభిమానం వుందా? లోగడ ఆమే, మామగారూ పట్నంలో మరిదింట వున్నప్పుడు, మీకు జ్వరం తగులుతున్నదని తెలిసీరాలేదు." అన్నది.

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

గిరీశం జవాబు చెప్పకుండా తలూపి వూరుకున్నాడు.

పదిహేను రోజుల తరవాత అనసూయమ్మ పట్నంనుంచి తిరిగివచ్చి కోడలితో, "సుమతీ, సత్యం మూడు రోజుల జ్వరానికే విపరీతంగా భయపడి పోయాడు. దగ్గిరవుండి పథ్యం పెట్టించి, మరో వారం రోజులు కూడా వుండి వచ్చాను," అన్నది.

సుమతి వచ్చే కోపాన్ని ఆపుకుంటూ, "అలాగా, అత్తయ్యా!" అని వూరుకున్నది.

వారం రోజులు గడిచాక అనసూయమ్మ తమ్ముడు అరవిందం రంగపురం వచ్చాడు. అతడు దూరాన ఒక కుగ్రామంలో చిన్న వ్యవసాయదారు. నాలుగైదు సంవత్సరాలక్రితం వరసగా రెండు సంవత్సరాలు వానలు లేక పంటలు పూర్తిగా దెబ్బతినిపోయినప్పుడు, అనసూయమ్మ తన బంగారు నగ అమ్మి నాలుగు వేల రూపాయలు తమ్ముడికి సాయం చేసింది.

అరవిందం ఆ మొత్తం అనసూయమ్మకు యిచ్చి, "అక్కా, నువ్విచ్చిన యీ నాలుగు వేలూ తిరిగి వ్యవసాయంలో కోలుకోవడానికి నాకు బాగా సాయపడినై. ఇప్పుడే యిబ్బందులూ లేవు. పంటలు బాగా పండుతున్న కారణంగా, అంతా సుఖంగా గడిచిపోతున్నది," అని, రెండు రోజులు వుండివెళ్ళిపోయాడు.



తమ్ముడు వెళ్ళిపోగానే అనసూయమ్మ సుమతిని పిలిచి, "ఈ వయసులో నేను తిరిగి నగ చేయించుకోవడం ఏమిటి! నీ మరిది సత్యం పట్నంలో బాగానే సంపాయిస్తున్నాడు. వాడికేం కొదవంటూ లేదు. వాడితో పోలిస్తే గిరీశం సంపాదన చాలా తక్కువ. తమ్ముడు యిచ్చిపోయిన ఈ నాలుగు వేలూ మీరు తీసుకోండి," అని డబ్బు ఆమె కిచ్చింది.

అత్తగారి మంచితనం, ఆప్యాయతా చూసి సుమతి కళ్ళవెంట ఆనంద బాష్పాలు జలజల రాలాయి. క్షమించ మన్నట్టు ఆమె అత్తగారి పాదాలకు నమస్కరించింది.

ఆ రాత్రి భార్య చెప్పగా సంగతి తెలుసుకున్న గిరీశం, "సుమతీ, అమ్మ సత్యాన్ని చూడబోయినప్పుడు నీవన్న మాటలు గుర్తున్నాయా? ఆమెకు పక్షపాత బుద్ధి అంటగట్టావు. అప్పట్లో నేనేం మాట్లాడీ ప్రయోజనం లేదని వూరుకున్నాను. అమ్మకు నేనూ, సత్యం ఒకటే. ఎవరు ఎందులో తక్కువగా వుంటే, తనకు చాతనైనంతలో అది సరిదిద్దడానికి ప్రయత్నిస్తూ వుంటుంది. నా గురించి బాగా తెలిసిన అమ్మకు, నా ఆరోగ్యం గురించి బెంగలేదు. కాని, సంపాదనలో వాడికంటే తక్కువ అన్న బాధవున్నది," అన్నాడు.

సుమతి విచారంగా ముఖం పెట్టి, "తెలివితక్కువదాన్ని అత్తగారి మనసెలాంటిదో గ్రహించడానికి యింతకాలం పట్టింది. మన సంపాదన తక్కువైనా, పల్లెవాసం గనక సుఖంగానే జరిగిపోతున్నది. ఎంత సంపాయించినా పట్నంలో ఖర్చు లెక్కువ. అత్తగారు మనకిచ్చిన యీ నాలుగు వేలల్లో సగం మరిదిగారి కివ్వడం బావుంటుందిగదా!" అన్నది.

అనుకోకుండా తన భార్యలో వచ్చిన మంచి మార్పు చూసి గిరీశానికి కలిగిన ఆనందం అంతాయింతా కాదు. అతడు సరేనన్నాడు.






# ఆస్తి పంపకం

ధారానగరంలో వజ్రచిత్తుడనే ఒక ధనికుడుండేవాడు. ఆయనకు వంద ఎకరాల పొలమూ, ఒక నగల దుకాణమూ వుండేది. ఆయనకు శ్రీముఖుడు, బహుముఖుడు అనే ఇద్దరు కొడుకులు. వాళ్ళ సహాయంతో ఒక పక్క వ్యవసాయాన్నీ, మరోపక్క వ్యాపారాన్నీ అభివృద్ధి చేస్తూ వచ్చాడు. తరాలతరబడి తింటూ కూర్చున్నా తరగనంత ఆస్తి సమకూరాక, వజ్రచిత్తుడి మనసు భగవంతుడికేసి మళ్ళింది. కాశీకి పోయి భగవధ్యానంలో మిగిలిన జీవితాన్ని గడపాలనుకున్నాడాయన.

ఒకనాడు వజ్రచిత్తుడు తన కొడుకులిద్దరినీ పిలిచి, తన నిర్ణయం గురించి చెప్పాడు. శ్రీముఖుడికీ, బహుముఖుడికీ తండ్రిపట్ల ఎంతో భక్తి. వాళ్ళకు ఆయన కాశీవెళ్ళి, అక్కడే స్థిరపడిపోవడం ఇష్టం లేదు. కాని, తండ్రి నిర్ణయాన్ని మార్చడం సాధ్యం కాదని గ్రహించి సరే, అంటూ తలలు వూపారు.

వజ్రచిత్తుడికి ఆస్తి పంపకం విషయంలో ఒక సమస్య ఎదురయింది. కొడుకులిద్దరూ తెలివిగలవాళ్ళే. పనిపాటుల విషయంలో శ్రమకు ఓర్వగల శక్తీ, పట్టుదలా గల వాళ్ళు కూడా. కాని, వ్యవసాయానికి పనికిరాగల బుద్ధికుశలత వ్యాపారానికి పనికిరాదు; అలాగే వ్యాపారానికి అవసరం అయిన మాటనేర్పూ, శాంతస్వభావం వ్యవసాయానికి అక్కరకు రాదు.

వజ్రచిత్తుడు దీర్ఘంగా ఆలోచించి మర్నాడు కొడుకులిద్దరినీ పిలిచి, వాళ్ళకు చెరొక రూకనిచ్చి, "దీనితో సంతకు వెళ్ళి, మీకు నచ్చిన వస్తువులు కొనుక్కురండి," అన్నాడు.

శ్రీముఖుడు తండ్రి ఇచ్చిన రూకను ఇటూ అటూ తిప్పి పరిశీలించి, "ఇది

ఎమ్. రాధాకిషన్

నకిలీనాణెం! ఇలాంటి నాణెం ఇచ్చి వస్తువులు కొనుక్కురమ్మంటే ఎలా? సంతలో వ్యాపారంచేసే వాళ్ళు అంత అమాయకులేం కాదు. దొంగ నాణెం మార్చ చూసినందుకు, నే నవమానం పాలయినా ఆశ్చర్యం లేదు,'' అంటూ దాన్ని నేలకేసి విసిరికొట్టాడు.

బహుముఖుడు తన వద్ద వున్న రూక కూడా నకిలీదే అని గ్రహించి, దాన్ని తండ్రికి తిరిగి ఇస్తూ, ''సంతలో చిల్లర దొరకడం కష్టం కావచ్చు. దీన్ని తీసుకుని చిల్లరగా ఇస్తే సౌకర్యంగా వుంటుంది,'' అన్నాడు.

వజ్రచిత్తుడు కొడుకుల కేసి చిరు నవ్వుతో చూస్తూ, ''అస్తిపంపకం విషయంలో యిది నేను, మీకు పెట్టిన పరీక్ష!'' అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆశ్చర్యపోతూ, ''పరీక్షవల్ల తేలిందేమిటి?'' అని అడిగారు.

శ్రీముఖుడికి పాలమూ బహుముఖుడికి నగలదుకాణమూ ఇవ్వనిశ్చయించినట్టు వజ్రచిత్తుడు చెప్పాడు. ఆ నిర్ణయానికి కారణం ఏమిటో వివరించవలసిందిగా కొడుకులిద్దరూ తండ్రిని కోరారు.

వజ్రచిత్తుడు ఇలా చెప్పాడు: ''వ్యవసాయం చేయడానికి పాలేర్లూ, కూలీల మీద అవసరపడినప్పుడు కొంత దుడుకుగా, తీవ్రంగా వ్యవహరించే మనస్తత్వం అవసరం. నగలదుకాణం నిర్వహించడం కత్తిమీద సాము వంటిది. సామాన్యులూ, జమీందార్లూ, రాజవంశస్థులూ-ఇలా అనేక తరగతులకు చెందిన ఖాతాదార్లతో అతి నేర్పుగా, యుక్తిగా వ్యవహరించ వలసి వుంటుంది. నేనిచ్చిన నాణెం నకిలీదని గుర్తించి, మీలో ఒకరు దుడుకుగానూ, మరొకరు యుక్తితోనూ ప్రవర్తించారు. మీ ప్రవర్తనలకు అనుగుణంగా శ్రీముఖుడికి పొలమూ, బహుముఖుడికి నగల దుకాణమూ యివ్వనిశ్చయించాను.''

తండ్రి నిర్ణయం సమంజసంగా తోచి కొడుకులిద్దరూ అందుకు సంతోషంగా అంగీకరించారు.





# విష్ణు కథ

పడిపోయిన జమదగ్ని మరణించినట్లే ఉండిపోయాడు. రేణుకాదేవి భర్తమీద పడి ఏడుస్తున్నది. అప్పుడే అరణ్యాల నుండి పరశురాముడు ఆశ్రమానికి వచ్చాడు. జరిగింది తెలుసుకొని పరశువును ఎత్తి ఝళిపిస్తూ, వెనుదిరిగి చూడకుండా మాహిష్మతీ నగరానికి పరుగెత్తాడు

అంతలో భృగుమహర్షి ఎక్కణ్ణించో వస్తూ జమదగ్ని ఆశ్రమం చేరాడు. రేణుకను ఓదార్చి, జమదగ్నిలోంచి పోతున్న ప్రాణాన్ని తన యోగశక్తితో నిలబెట్టి బ్రతికించాడు.

అక్కడ మాహిష్మతీనగరానికి తోలుకుపోయిన ధేనువును కోరిన వాటిని ఆశ్రమంలో యిచ్చినట్లుగా రాజధానిలో యివ్వలేదని సైనికులు కొడుతున్నారు, పొడుస్తున్నారు. సరిగా ఆ సమయానికి పరశురాముడు ప్రళయరుద్రుడై వచ్చాడు. సైనికులు పారిపోయారు. ఆవును పరశురాముడు దువ్వి ఆశ్రమానికి వెళ్ళు అన్నట్లుగా తట్టాడు. ధేనువు ఉరకలువేస్తూ వెళ్ళింది.

"ఓ రాజాధమా! సంరక్షకుడై ఉండవలసిన రాజు దుర్మార్గుడైనప్పుడు శిక్షించక తప్పదు. మేడదిగి ఇవతలికిరా!" అని పరశురాముడు రాజప్రాసాదం ముందు కేకవేశాడు.

కార్తవీర్యుడు మొదట పరశురాముణ్ణి సాధారణ మునికుమారుడనుకున్నాడు



గాని, అతని ధాటి తెలిశాక వెయ్యి చేతులతో ఎదుర్కొన్నాడు. ఇద్దరికీ ద్వంద్వ యుద్ధం సాగింది.

కార్తవీర్యార్జునుడు ప్రయోగించిన అస్త్రాలను, శస్త్రాలను పరశురాముడు గొడ్డలితో తుత్తినియలు చేశాడు. అతని వెయ్యి చేతులను చెట్టుకొమ్మలు నరికినట్లుగా తెగ్గొట్టాడు. కార్తవీర్యుడు మొండి బోదెగా కూలిపోయాడు. అప్పుడు అతనికి తాను శాపవశంతో పుట్టిన చక్రపురుషుడనని గుర్తుకొచ్చింది. పరశురాముడు విష్ణువే అని తెలిసి మనస్సులోనే దండం పెట్టి దేహం చాలించి వెళ్ళి సుదర్శన చక్రంలో లీనమయ్యాడు.

పరశురాముడు ఇంటికివచ్చి తన తండ్రి క్షేమంగా ఉండడం చూసి తాను చేసినది చెప్పాడు.

జమదగ్ని, ''నాయనా! నువ్వు చేసినది మునులమైన మనకు తగని పని. అందుకు పరిహారంగా నువ్వు తపస్సు చేయాలి!'' అన్నాడు.

పరశురాముడు, ''తండ్రీ! రాజు అధర్మపరుడైనప్పుడు శిక్షించ వలసిన అర్హత అందరికీ ఉంది! నీ ఆనతి గనుక నేను తపస్సు చేస్తాను కాని, ప్రాయశ్చిత్తంగా కాదు,'' అని చెప్పి అరణ్యానికి పోయి తపస్సులో మగ్నుడయ్యాడు.

కార్తవీర్యుడి వెయ్యిమంది కుమాళ్ళు హైహయక్షత్రియులందర్నీ కూడగట్టుకొని జమదగ్ని ఆశ్రమం మీదకు విరుచుకు పడ్డారు. అప్పుడు జమదగ్ని నిశ్చలంగా తపస్సమాధిలో ఉన్నాడు. రేణుకాదేవి, ''రామా! రా!'' అంటూ ఎలుగెత్తి ఇరవై ఒక్కసార్లు పిలిచింది.

హైహయులు జమదగ్ని తలను నరికేశారు. రేణుక ఇరవైఒక్కసార్లు గుండెలు బాదుకొంటూ భర్త మొండెంమీద పడి విలవిలా విలపించి సొమ్మసిల్లింది. జమదగ్ని తల దొర్లుకుంటూ దూరంగా పోయి రాళ్ళ మధ్య చిక్కుకుంది. రాజపుత్రులు ఆశ్రమాన్ని తగలబెట్టారు.

అ మంటల్లో రేణుక, భర్త కళేబరంతో కలిసి కాలిపోయింది.

అరణ్యంలో తపస్సు చేస్తున్న పరశురాముడికి ధ్యానభంగం అయింది. తల్లి పిలుపు ఇరవైఒక్కసార్లు చెవుల్లో మర్మరంగా వినిపించింది. మనస్సు కీడు శంకించింది. ఒక్క అంగలో ఆశ్రమం చేరుకున్నాడు.

ఆశ్రమం తగలబడుతున్నది. తల్లీ, తండ్రీ మసి అయ్యారు. హైహయ సైనికులు ఆశ్రమవాసుల్నీ, వారించ వచ్చిన పరిసర జానపద జనుల్నీ అమానుషంగా చిత్రవధ చేస్తున్నారు.



పరశువును ప్రసాదించిన శివుణ్ణి స్మరించి, పరశురాముడు గొడ్డలిని తీసి జ్వాలలాగ లేచాడు. ముళ్ళపొదల్ని నరికినట్లుగా అందినవారి నందర్నీ హత మార్చాడు.

రాళ్ళమధ్య పడి ఉన్న జమదగ్ని తలను తీసి రొమ్ముకు అదుముకొని, "తండ్రీ! కన్నీరు కూడా రాకుండా నా గుండె జ్వలించి పోతున్నది. క్షత్రియుల రక్తంతో నీకు తర్పణం చేస్తాను. నీ తలను ఆ రక్తపు మడుగుల్లో ముంచి అంత్యక్రియలు చేస్తాను!" అని అంటూ పరశురాముడు ఉన్నత శిలాగ్రం మీదకు ఎక్కి పరశువును ఎత్తి, "ఈ గొడ్డలితో భూమ్మీద రాజన్నవాడు లేకుండా నరుకుతాను!" అని ఇరవై ఒక్కమార్లు గర్జిస్తూ ప్రతిజ్ఞ చేశాడు. దిక్కులు ప్రతిధ్వనించాయి. అతని భీషణ ప్రతిజ్ఞ విని బ్రహ్మ, మహర్షులు వచ్చి శాంత వచనాలు పలికారు.

భృగుమహర్షి, "నాయనా! దుర్మార్గుల్ని ఆ భగవంతుడే శిక్షిస్తాడు, సాధు సజ్జనుల్ని రక్షిస్తాడు! నువ్వు శాంతించు!" అన్నాడు.

పరశురాముడు, "ఆ భగవంతుడు ఆకాశంనుంచి ఊడిపడడు; మనిషిగా పుట్టి మనుషుల మధ్యే ఉంటాడు. అలాంటి వాడినే నేను అని పితామహులు



గ్రహించాలి. శాంతవచనాలతో నాకు పనిలేదు!'' అంటూ అదే పరుగున హిమాలయానికి వెళ్ళి శివుణ్ణి గూర్చి తపస్సు చేశాడు.

శివుడు ప్రసన్నుడై పరశురాముణ్ణి శాంతపరచ బోయాడు. పరశురాముడు, ''శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదుగదా! లయమూర్తివైన నీకు చెప్పవలసింది లేదు. నా ప్రతిజ్ఞ నెరవేర్చడానికి కావలసిన బలాన్నియివ్వు!'' అన్నాడు.

శివుడు అతనికి అన్ని అస్త్రాలను యిచ్చి ప్రత్యేకమైన దివ్యాస్త్రాన్ని యిస్తూ, ''ఇది భార్గవాస్త్రంగా నీ పేరున నిలుస్తుంది! నీవు కారణజన్ముడివైన అవతార మూర్తివి! వెళ్ళు, నీకు అడ్డులేదు!'' అని ఆమోదంతో ఆశీర్వదించాడు.

పరశురాముడు గోలోకంలో విష్ణువు మరొక రూపంగా ఉండే కృష్ణుణ్ణి ధ్యానించి, కృష్ణ కవచాన్ని పొందాడు. కృష్ణుడు అతనికి తన అంశను గొప్ప ధనుస్సుతో కలిపి ప్రసాదించి, రామావతారంలో తిరిగి తీసుకుంటానని చెప్పాడు.

పరశురాముడు క్షత్రియులపై విజృంభించాడు. రాజుల దుష్పరిపాలనలో అగచాట్లు పడుతున్న జనానీకం అతని అండ చేరారు. కార్తవీర్యుడి కుమాళ్ళతో సహా హైహయులందరూ నగరం విడిచి పారిపోయారు. పరశురాముడు ఆగ్నేయాస్త్రాన్ని నగరంపై వేశాడు. పరశురామ ప్రీతిగా మాహిష్మతీ రాజధాని ఇరవై ఒక్క రోజులపాటు జ్వాలల్లో నామరూపాల్లేకుండా దగ్ధమైంది.

కార్తవీర్యుడి వెయ్యిమంది కుమాళ్ళూ, హైహయవంశ క్షత్రియులూ, దేశ దేశాల రాజులందరూ కూడగట్టుకొని పరశురాముణ్ణి ఎదుర్కొన్నారు. బలిపశువుల్ని నరికినట్లుగా పరశురాముడు అందర్నీ తెగటార్చి, వాళ్ళ రక్తాన్ని ఐదు మడుగుల నిండా నింపి, జమదగ్ని తలను వాటిలో ముంచి, ముంచి పితృతర్పణం చేశాక అగ్ని సంస్కారం జరిపాడు.



శమంత పంచకం అనబడే ఆ అయిదు రక్తపు మడుగుల ప్రదేశమే తరువాతి కాలంలో కురుక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. మరొకసారి బలికోరింది. మహాభారత సంగ్రామంలో అక్కడే రక్తం వరదలై పారింది.

పరశురాముడు యజ్ఞం చేసి శుచి చేసుకొని తండ్రికి ఉత్తరక్రియలు జరిపాడు. తరవాత క్షత్రియ సంహారానికి బయలుదేరాడు. వెతికి, వెతికి క్షత్రియుల్ని గండ్రగొడ్డలికి అహుతి చేశాడు. క్షత్రియ మాతలు వంశాంకురాలైన పిల్లల్ని బ్రాహ్మణుల ఇళ్ళల్లో దాచారు. తాము కూడా బ్రాహ్మణ కాంతలుగా వేషాలు మార్చుకొని. పసివాళ్ళను బ్రాహ్మణ బాలలుగా చేసి తల దాచుకొన్నారు.

ఆ విధంగా పరశురాముడు ఇరవైఒక్క సార్లు దేశాలు గాలించి క్షత్రియులనిపించుకొనేవారు కనపించకుండా దండయాత్రలు చేశాడు. అతని ప్రతిజ్ఞ తీరింది. క్షత్రియ సంహారం చేశాక తన అధీనమైన భూమినంతటినీ కశ్యపుడికి దానంచేసి, వెళ్ళి దక్షిణ సముద్రంలో ఉన్న మహేంద్ర పర్వతం మీద తపస్సులో నిమగ్నుడయ్యాడు.

బ్రాహ్మణుల ఇళ్ళల్లో, మునుల అశ్రమాల్లో పెరిగి పెద్దవారైన క్షత్రియకుమారులందరికీ కశ్యప ప్రజాపతి పరశురాముడిచ్చిన రాజ్యాల భూముల్ని పంచియిచ్చాడు. రాజ్యాలు ఏర్పడ్డాయి. రాజవంశాలు తలలెత్తాయి.

అటువంటి రాజవంశాల్లో ఇక్ష్వాకు సంతతికి చెందిన రఘుమహారాజు గొప్ప కీర్తిగాంచి, రఘువంశానికి మూలపురుషుడయాడు.

రఘువంశంలో విష్ణువు దశరథమహారాజు పెద్ద కుమారుడుగా రామావతారం ఎత్తి, ఆదర్శ మానవత్వాన్ని ఆచరణలో చూపించాడు. రాక్షస సంహారం చేశాడు. రామరాజ్యంగా పేరు పొందేలాగ రాజ్యపాలన చేశాడు. రాజుగా ప్రజాభిమతాన్ని

బట్టి ఎలాంటి త్యాగాన్నైనా చేయక తప్పదని నిరూపించాడు.

"దశావతారాల్లో ఏడవది అయిన రామావతారం వాల్మీకిమహర్షి రచనలో రామాయణ కావ్యంగా విశేషవ్యాప్తి పొందింది." అని చెప్పి సూతమహర్షి రామకథను ప్రారంభించాడు.

హిరణ్యకశిపుడూ, హిరణ్యాక్షుడూ, విష్ణువుచేత హతులై, రెండో రాక్షస జన్మగా రావణుడూ, కుంభకర్ణుడుగా పుట్టి అడ్డూ అదుపూ లేకుండా, లోకభయంకరులై విజృంభించారు.

రావణాసురుడు గొప్ప తపస్సు చేసి బ్రహ్మవలన దేవ, యక్ష, గంధర్వాదులెవ్వరిచేతా హానిలేని వరాన్ని పొందాడు. మానవమాత్రులు తన్నేం చేయగలరనే నిర్లక్ష్యంతో నరులను కలపలేదు.

కుంభకర్ణుడు పర్వతాకారుడు. తపస్సు చేసి ఆరునెలలు నిద్ర, ఆరునెలలు జాగృతిగా వరం పొంది, మనుషుల్ని చంపి తింటూండేవాడు.

రావణుడు, కుబేరుడి పుష్పక విమానాన్ని లాక్కొని అతణ్ణి లంకనుంచి వెళ్ళగొట్టి, లంకానగరాన్ని స్వాధీనం చేసుకొని లంకేశ్వరుడై రాక్షసులైన వారినందర్నీ కూడగట్టుకుని, లోకాలు జయించి వీరవిహారం చేశాడు.



రావణుడు పదితలలవాడు. కైలాసం వెళ్ళి నందీశ్వరుడి ముఖాన్ని కోతిముఖమని వెక్కిరించి, కోతులవల్లనే లంకకు ముప్పు వాటిల్లుతుందని శాపం పొందాడు.

ఇరవై భుజాల తీటతీరేలాగ కైలాసాన్ని ఎత్తి, శివుడు కాలి బొటనవ్రేలితో నొక్కేసరికి పర్వతం కింద నలిగి పెద్ద పెట్టున ఆర్తారావం చేసి రావణుడు అనిపించుకున్నాడు. అంతకు ముందు దశకంఠుడని పిలువబడుతూండేవాడు.

రావణుడు ఒక్కొక్క తలను ఖండించుకొని శివుణ్ణి అనేక విధాలుగా స్తోత్రగానాలు చేసి, శివుడి అనుగ్రహం పొందగలిగాడు.

రావణుడు ఎంత గొప్ప శివభక్తుడో, అంత దురహంకారి. ఎంతటి పరాక్రమ వంతుడో అంత దుర్మార్గుడు. పరస్త్రీలను అపహరించుకు రావడం సాటిలేని ఘనత, ఎదురులేని వీరత్వంగా భావించి స్త్రీలను చెరపట్టడం అతనికొక పరిపాటి అయింది.

ఇష్టపడని కాంతను బలాత్కరించితే పదితలలు వెయ్యి చెక్కలౌతాయని శాపం కూడా సంపాదించు కున్నాడు.

రావణాసురుడి భార్య మండోదరి మయుని కూతురు. భర్త హితవు కోరి హితవు చెబుతూండేది. అతని సవతి తమ్ముడు విభీషణుడు ఉత్తముడు. రావణుడికి మంచి చెబుతూండేవాడు. కాని, రావణుడు ఒకరు చెబితే వినేలాంటి వాడు కాదు.

వింధ్య పర్వతానికి దక్షిణాన వున్న భూభాగమూ, సముద్రమూ, ద్వీపాలూ రావణరాజ్యంగా, లంకా మహాసామ్రా జ్యంగా రాక్షస సమూహాలు స్థావరంగా చేసుకొని, నరభక్షకులై, ఆర్యావర్తంలో యజ్ఞయాగాదులు జరక్కుండా ధ్వంసం చేస్తూ, ఋషులను చిత్రహింసలు పెట్టి వినోదిస్తూ, ఊళ్ళూ ఆశ్రమాలూ తగల బెడుతూ చెలరేగుతూండేవారు.

కృశధ్వజుడు అనే రాజర్షి వేదం చదువుతూండగా, పుట్టిన వేదవతి అనే కన్య విష్ణువును భర్తగా కోరుతూ తపస్సు చేస్తూండగా. రావణుడామెతో విష్ణువు కంటే తానే అధికుడననీ, తనతో వచ్చేయ మనీ ఆమె కొప్పు పట్టుకొన్నాడు.

వేదవతి, "దురాత్మా! నీవు తాకిన శరీరం విడుస్తున్నాను. నీ లంకలోనే నా అంతట నేను పుట్టి నీ సర్వనాశనానికే కారణం ఔతాను! విష్ణువే నన్ను వరిస్తాడు!" అని చెప్పి యోగాగ్ని రగుల్చు కొని దగ్ధమైపోయింది.

రాక్షస నిర్మూలనం చేసి లోక కల్యాణం చేకూర్చడం కోసం విష్ణువు అవతరించ వలసిన తరుణం వచ్చింది. విష్ణువు మాన వుడుగా, దేవతలు వానరులుగా జన్మించారు.





# అంగరక్ష

పుళిందరాజ్యానికి పాలకుడు సుగుణసింహుడు. ఆయన నిండు నలభై సంవత్సరాలు రాజ్యం ఏలాడు. ఆ నలభై సంవత్సరాలూ ప్రజలు సమస్తమైన సిరిసంపదలతో తులతూగుతూండేవారు.

సుగుణసింహుడికి వృద్ధాప్యం వచ్చేసింది. ఇక రాజ్యభారం కొడుకుపైన పెట్టేసి, తన శేషజీవితాన్ని దైవచింతనలో గడపాలనే ఆలోచన రాజుకు కలిగింది. ఈ ఆలోచనతో ఆయన ఒక పున్నమినాటి రాత్రి తన అంతఃపురంలో అటూ యిటూ పచారుచేస్తూ వుండగా కోటగంటలు ఖంగు ఖంగుమని పన్నెండుసారులు మోగడం వినబడింది.

గిరుక్కున తిరిగి హంసతూలికా తల్పంవైపు చూసేసరికి సుగుణసింహుని కళ్ళు జిగేలుమన్నాయి! పదారు వన్నె బంగారు ఛాయగల దేహకాంతితో మెరిసిపోతూ ఒక సుందరి ఆ తల్పంపైన కూర్చుని వుంది! ఆమెను చూసి రాజు ఆశ్చర్యపోయాడు.

''రాజా! నన్నెరగవా?'' అని అడిగింది, సుందరి. అలాగే నిలబడిపోయాడు రాజు.

''నా పేరు యశోదేవత. నీవు ధర్మమార్గం తప్పకుండా రాజ్యం నడిపించి, నీ కీర్తి దశదిశలా వ్యాపింపజేసేదిఎవరనుకున్నావు? నేనే,'' అన్నది, ఆమె. చాలా సంతోషించాడు రాజు.

''దేవీ! నా కీర్తి నిలబెట్టినందుకు నీకు కృతజ్ఞుణ్ణి. ఐతే, నా తరవాత నాకుమారుడి పాలనలో ధర్మం ఎలా నడుస్తుందో అనేదే నాకు పట్టుకున్న దిగులు,'' అన్నాడు.

అందుకు యశోదేవత, ''రాజా! ఎందుకు దిగులు? నిన్ను నడిపినట్టే నీ కొడుకునూ నడుపుతాను. చింతించకు,'' అంటూ అంతర్థానమైపోయింది.



మరి కొద్ది రోజులకే సుగుణసింహుడు మరణించాడు.

సుగుణసింహుని కొడుకు శీలసింహుడు గద్దె యెక్కి, అచిరకాలంలోనే అన్ని విధాలా తండ్రికి తగిన పుత్రుడు అని పేరుపొందాడు. తండ్రి నాటి నుంచీ వుంటున్న వృద్ధ మంత్రి ధర్మపాలుడినే తను కూడా ఆస్థానంలో ప్రధాన సలహాదారుగా నియమించుకున్నాడు.

ఇలా వుండగా ఒక పున్నమినాటిరాత్రి, సుగుణసింహునికి కనిపించినట్టే శీలసింహునికి కూడా యశోదేవత తూలికా తల్పం మీద ప్రత్యక్షమైంది. శీలసింహుడు ఆమె పట్ల భక్తి వినయాలు కనబరిచాడు. దేవి శీలసింహుణ్ణి దీవిస్తూ, ''నాయనా! ఈ ఉంగరమే నీకు అంగరక్ష. ఎప్పుడైతే నీ బుద్ధి ధర్మం తప్పి వక్రమార్గానికి పోతుందో, అప్పుడు ఈ ఉంగరం నీ వేలు నొక్కుతుంది. ఈ హెచ్చరిక గుర్తించి, పొరపాటును సరిదిద్దుకుంటూ వుండు,'' అంటూ హితబోధ చేసి, ఒక ఉంగరమిచ్చి అంతర్హితురాలైంది.

దేవి దయకు విస్తుపోతూ, శీలసింహుడు తనకు అంగరక్షగా ఆమె ప్రసాదించిన ఉంగరాన్ని ఆనందంతో ధరించాడు.

ఉంగరం మహిమవల్లనూ, మంత్రి ధర్మపాలుడి సలహాల వల్లనూ శీలసింహుడి పరిపాలన చాలాకాలం ఎంతో నేర్పుగా, ధర్మయుతంగా సాగింది. ఐతే ఎంతటి కట్టుదిట్టంలో వున్నప్పటికీ, యువకుడైన శీలసింహునిలో రాజ్యకాంక్ష అప్పుడప్పుడూ తలెత్తుతూ వుండేది.

రాజ్య కాంక్షతో పాటు శీలసింహుడి మనస్సు మారిపోయింది. ఇది ధర్మం, ఇది అధర్మం అనే విచక్షణాజ్ఞానం నశించింది. దురాశ పుట్టింది. దుష్టసంకల్పాలను దోహదం చేయటానికి తగిన పరివారమంతా ఆయన చుట్టూ చేరారు.

ఆ పరివారానికి పెద్ద, దుందుభి అనే సేనానాయకుడు. వాడికీ రాజుకూ స్నేహం మిక్కుటమైంది. ''రాజైన వాడికి రాజ్య

విస్తరణ చేసుకోవటమే ప్రజ్ఞ; ఇందుకోసం ప్రాణాలైనా బలిచేసి, రాజధర్మం నిలబెట్టుకోవాలి," అని దుందుభి దుర్బోధలు చేసి, సమయం దొరికినపుడల్లా శీలసింహుణ్ణి పురెక్కిస్తూ వచ్చాడు. దుందుభి నూరిపోసే ఈ బోధల ముందు మంత్రి ధర్మపాలుడి మాటలు శీలసింహుడికి చెవికెక్కటమే మానివేసినై.



అందుచేత క్రమంగా మంత్రి మాటలను త్రోసిరాజనటం ప్రారంభించాడు. రాజు అధర్మంగా, అకారణంగా ఇరుగు పొరుగు సామంతరాజుల మీదికి ఆకస్మికంగా దాడి వెడలటం పనిగా పెట్టుకొన్నాడు. మొండిపట్టు, క్రౌర్యం అతనిలో బాగా విజృంభించినై. ఒళ్ళుతెలిసే స్థితిలో లేడని చెప్పినా అతిశయోక్తి కాదు. అటువంటప్పుడు యశోదేవత ప్రసాదించిన అంగరక్ష ఐనటువంటి వేలి ఉంగరం ఎంత నొక్కినా అతడు గమనించకపోవటంలో ఆశ్చర్యమేముంది!

ఈ విధంగా శీలసింహుడు మునుపటి శీలసింహుడు కాదు అని పేరు మోగిపోయింది. ఇప్పటి శీలసింహుడు పరమ దుర్మార్గుడు, క్రూరుడు, అనేకమైన చిన్న రాజ్యాలను అన్యాయంగా వశపరచుకొన్నాడు. ఇలా యుద్ధాలు సాగించే తన వేడుక కోసం కొత్త కొత్త పన్నులు ఎన్నో విధించాడు. రాజులో కలిగిన ఈ మార్పు వల్ల ప్రజలు యమయాతనలు అనుభవించవలసి వచ్చింది. ప్రభువు పైన ప్రజకు ఉండే భక్తివిశ్వాసాలు సడలిపోయినై. అతడి దుష్టచర్యలను సహించలేక అతని స్వంత సేనలే అసహ్యించుకుని ఎదురు తిరుగసాగినై.

ఇంతచేసి, కొంతకాలానికి శీలసింహుడికి తన పైన తనకే రోత పుట్టేటంత క్లిష్టమైన పరిస్థితులు ఏర్పడినై. "లోకానికి ఎదురీది నేనెందుకు ఈ రాజ్యాలన్నీ జయించాలి? ఎందుకు అన్ని రాజ్యాలను అన్యాయం చేసి కలుపుకోవాలి? ఏమి బావుకునేందుకు ఇన్నిన్ని పన్నులు

విధించి ప్రజలను వేధించాలి ?'' అంటూ తనకుతానే ఎన్నో ప్రశ్నలు వేసుకో సాగాడు. ఒక్క ప్రశ్నకూ మనస్సు సమాధానం చెప్పలేకపోయింది.

తన క్షేమం కోరిన వృద్ధమంత్రి ధర్మపాలుడి సలహాలు పెడచెవిని పెట్టి ప్రవర్తించినందుకూ, దేవి ప్రసాదించిన ఉంగరాన్ని లెక్కచేయకుండా ధిక్కరించినందుకూ శీలసింహుడు ఎంతగానో నొచ్చుకున్నాడు.

ఇలా ఉండగా వృద్ధమంత్రి ధర్మపాలుడు మరణించాడు. శీలసింహుడికి తెలియకుండానే, తనకు దుర్బోధలు చేసిన మిత్రులు రాజ్యాన్ని హస్తగతం చేసుకోసాగారు. రాజ్యంలో హత్యలకూ చోరీలకూ హద్దులేకుండా పోయింది. రాజభవనంలోనే ఒకరోజున కలవరం బయల్దేరింది. ఈ కలవరానికి నగరమంతా అట్టుడికినట్టు ఉడికిపోతున్నది. ''ఇదంతా ఏమిటి?'' అని ప్రశ్న వేశాడు శీలసింహుడు. ''మీ మేనకోడలు పావనిని ఉరి తీయబోతున్నారు!'' అని చెప్పారు భటులు.

కల నుంచి మేలుకొన్నట్టయింది శీలసింహుడికి. ఆ క్షణంనుంచీ అతనిని ఉంగరం విడవకుండా మరింత గట్టిగా నొక్కుతూనే వుంది. వెంటనే మేనకోడలిని రప్పించాడు. ఆమె దైన్యావస్థకు నొచ్చుకున్నాడు. తన చుట్టూ వున్న మిత్రులు చేసిన కుట్ర, ద్రోహం ఆమెవల్ల గ్రహించి తక్షణమే వాళ్ళందరినీ ఖైదు చేయించాడు.

అంతవరకు అతని వేలు విడవక గట్టిగా నొక్కుతూ వుండిన ఆ ఉంగరం గప్పున ఒక్కమారుగా వింతకాంతితో వెలిగింది. ఆ క్షణమందే శీలసింహుడికి జ్ఞానోదయమైంది. అప్పుడు తనను కాపాడే అంగరక్షను పూర్తిగా నమ్ముకున్నాడు. దేవి ప్రభావం తెలుసుకొన్నాడు. తండ్రి కోరికను జ్ఞాపకం తెచ్చుకున్నాడు. నాటినుండీ మరెన్నడూ శీలసింహుడు ధర్మమార్గం వీడలేదు.



# వృత్తి-ప్రవృత్తి

కుందరపల్లి అనే గ్రామానికి రామచంద్రయ్య గ్రామపెద్ద. ఆ పదవి రామచంద్రయ్య కుటుంబానికి తరతరాలుగా సంక్రమిస్తున్నది. ఆయనకు యిద్దరు కొడుకులు. ఇద్దరూ బాగా చదువు సంధ్యలు నేర్చి, గ్రామంలో మర్యాదా మన్ననలు పొందుతున్నారు.

రామచంద్రయ్యకు వయసు మీరుతున్నకొద్దీ, ఓపిక తగ్గసాగింది. ఆయన తన కొడుకులిద్దరిలో ఒకరికి గ్రామపెత్తనం కట్టబెట్టాలనుకున్నాడు. ఎంత ఆలోచించినా ఆయనకు కొడుకులిద్దరూ ఆ పదవికి సమానార్హతలు కలవాళ్ళుగా కనిపించారు.

ఈ విషయమై సలహా అడిగేందుకు రామచంద్రయ్య తన బాల్యమిత్రుడైన పొరుగు గ్రామపెద్దకు కబురుపెట్టి, పిలిపించాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటున్న సమయంలో రామచంద్రయ్య పెద్దకొడుకు తండ్రి దగ్గరకు వచ్చి, "నాన్నా, పొరుగూరు తిరనాళ్ళకు నేనూ, నా స్నేహితులూ వెళుతున్నాం. వాళ్ళు అడ్డదారిన అక్కడికి వెళదాం అంటున్నారు. నాకు ఇష్టం లేకపోయినా, వాళ్ళ బలవంతం వల్ల సరే అన్నాను. తమ్ముడు మాత్రం, ఆ దారి బావుండదు, నేను మామూలు దారినే వస్తానన్నాడు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ మాటలు విన్న పొరుగూరి గ్రామపెద్ద, రామచంద్రయ్యతో, "స్నేహితుల బలవంతం మీద అడ్డదారి తొక్కేవాడు గ్రామపెద్దగా పనికిరాడు. ఆ పదవిని రెండో కొడుక్కే అప్పచెప్పు," అని సలహా యిచ్చాడు.

రామచంద్రయ్య సమస్య తీరిపోయింది. ఆయన చిన్నకొడుకు గ్రామపెద్ద అయాడు.

—మెడికో కృష్ణసుబ్బారావు



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



K. S. Vijayaker



Pranlal Patel

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఆగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నైవేద్యం సమర్ప యామి! రెండవ ఫోటో: నాకేమీ అందలేదు స్వామీ!

పంపినవారు: సి. డి. చారి, మహారాణిపేట, విశాఖపట్నం-530 002

*బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా? సమాధానాలు:

1. కలకత్తా 2. రోమ్ నగరం; ఇది ఏడుకొండల మీద నిర్మింపబడి వున్నది. 3. శాన్‌ఫ్రాన్సిస్కో (అమెరికా) 4. కొలోన్ - మాగీల స్మశాన వాటిక. 5. కెనడాలోని మాంట్రియల్ నగరం. నగరంలోని వీధులన్నిటికీ సాధువుల పేర్లతో సంబంధం వుండడం వల్ల, ఈ నగరానికాపేరు వచ్చింది. 6. ఇటలీ లోని పావియానగరం. నగరమంతా శిఖరాలమయంగా వుండడం వల్ల దానికాపేరు వచ్చింది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications)

# న్యూట్రముల్ శక్తి.

## ఛాంపియన్లు ఎంచుకునేది యిది.

న్యూట్రముల్. సమృద్ధి అయిన అమూల్ పాలు. ఎంచిన మాల్ట్. ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు. పుష్టినిచ్చే ప్రోటీన్లు. అత్యవసరమైన ఖనిజాలు. ఉల్లాసాన్నిచ్చే చాక్లెట్... యివన్నీ గూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవా కన్నా చాలా తక్కువ ధరలో. మరో విషయం గుర్తుంచుకోండి. కేవలం న్యూట్రముల్‌కే ఐ ఎస్ ఐ నాణ్యతముద్ర వుంది.

Nutramul
AMUL'S NOURISHING DRINK




**మరింత పొడుగ్గా,
బలంగా, పుష్టిగా అవడం ఎలా?**

కనివిని ఎరుగని శక్తినిచ్చే పుస్తకపు కానుక:

To: Nutramul, P.O. Box 10148, Bombay 400 001. FT

ప్రియమైన న్యూట్రముల్,

దయయుంచి నాకు దారాసింగ్ గారి 'హైట్ ఇన్‌క్రీజ్ స్ట్రెంగ్త్ అండ్ ఫిట్‌నెస్' పుస్తకం పంపించండి. నేను రు. 1-50 పోస్టేజి స్టాంపులూ, న్యూట్రముల్ 500 గ్రా. డబ్బా కొన్న క్యాష్ మెమోనీ జతపరుస్తున్నాను. సరుకు సరుకు వున్నంతవరకే యీ కానుక అని నాకు తెలుసు.

పేరు ______________ (పెద్ద అక్షరాలలో)

అడ్రసు ______________



మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లి.
ఆనంద్ 388 001

ఎండలో ఆట, ఇసుకలో ఆట
బంతితో ఆట, ఆటే ఆట
కెరటాలు కూడా పారిపోవునిక
జెమ్స్ తింటాం మరి అందరం యిక!








**చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని**
**చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!**

క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

# రాము-శ్యాము

## లక్కీ నంబరు 50

